గునస్తే; మద్భక్తః-నాకు సేవకుడవును; మద్యాజీ- నన్ను బూజిం చువాడవును; భవ-కమ్ము; మాం-నన్నుగూర్చి; నమస్కురు- నమస్కరించుము; ఏవం - ఈప్రకారముగా; మత్పరాయణః సన్-నాయందు బ్రీతిగలవాడవై; ఆత్మానం-మనస్సును; మ యి-నాయందు; యుక్త్వా-కూర్చి; మామేవ-నన్నే: ఏష్యసి- పొందగలవు.

నీవు నాయందు మనస్సునిలిపినవాడవు, భక్తిజేసి నన్ను పూజించి నాకు వందనములు జేయుము. ఈ విధముగ నీవు ఎల్లకాలములయందు భక్తి శ్రద్ధలతో స్థిరచిత్తమును వుంచితి వేని నన్నే పొందగలవు.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మావిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
రాజవిద్యారాజగుహ్య యోగోనామ
నవమోధ్యాయః.

ఉపనిషద్రూపములును, బ్రహ్మవిద్యయును, యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జునసంవాదరూపంబగు రాజవిద్యారాజగుహ్య యోగ మనెడి నవమోధ్యాయము ముగిసినది.

---

శ్రీభగవద్గీత.

విభూతియోగోనామ దశమోఽధ్యాయః.

శ్రీభగవాన్ ఉవాచ.

భూయఏవమహాబాహో శృణుమేపరమంవచః।
యత్తేహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా.

హే మహాబాహో-ఓ యర్జునా; అహం-నేను; ప్రీయమాణాయ-సంతోషపడుచున్న; తే-నీకొరకు; హితకామ్యయా-హితముజేయు నిచ్ఛచేత; భూయఏవ - మరల; పరమం - ఉత్కృష్టమైన; యద్వచః-ఏవాక్యమును; వక్ష్యామి - చెప్పగలనో; మే-నాయొక్క; తత్-ఆవాక్యమును; శృణు - వినుము.

ఓ అర్జున! ప్రీతితో వినుచున్న నీకు మంచిచేయవలెనను కోరికతో పరమోత్కృష్టమయిన ఏ వాక్యమును నేను చెప్పబోవుచున్నానో దానిని ఆలకింపుము.

న మేవిదుస్సురగణాః ప్రభవంనమహర్షయః।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాంచసర్వశః. 2

మహర్షయః-భృగ్వాదిమహర్షులు; మే- నాయొక్క; ప్రభవం-ప్రభుశక్త్యతిశయమును; నవిదుః- తెలియరు; సురగణాః- దేవసమూహములును నవిదుః-ఎరుగరు; అహం- నేను;

దేవానాం-దేవతలకును; మహర్షీణాంచ-మహర్షులకును; సర్వశః-సర్వప్రకారములచేత; ఆదిః-మొదటివాడనుగదా.

ఇంద్రాది దేవతలు గొప్పఋషులు నా ఉత్పత్తి స్థానమును తెలియరు. ఇంద్రాది దేవతలకును ఋషులకును ఉత్పత్తి కారణము నేనే గదా?

యోమామజమనాదించ వేత్తిలోకమహేశ్వరమ్।
అసంమూఢస్సమర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. 3

అనాదిం-ఆదిలేని; అజం-పుట్టుకలేని; లోకమహేశ్వరం-లోకమునకు నియామకుడైన; మాం-నన్ను, యః-ఎవ్వడు; వేత్తి-తెలియుచున్నాడో; మర్త్యేషు-మనుష్యులయందు; అసంమూఢః-మౌఢ్యవర్జితుడైన; సః-వాడు; సర్వపాపైః-సమస్తపాపములచేత; ప్రముచ్యతే-విడువబడుచున్నాడు.

నన్ను మొదలులేనివాడనియు పుట్టుకలేనివాడనియు ఎల్ల జనులకు నియామకుడనియు ఏ పురుషుడు తెలియునో అట్టివాడు మోహమును విడిచినవాడై సమస్తపాపములచేత విడువబడినవాడగును.

బుద్ధిర్జ్ఞానమసంమోహః క్షమాసత్యందమశ్శమః।
సుఖందుఃఖంభవోభావో భయంచాభయమేవచ. 4

అహింసాసమతాతుష్టి స్తపోదానంయశోయశః।
భవంతిభావాభూతానాం మత్తఏవపృథగ్విధాః. 5

బుద్ధిః—బోధసామర్థ్యమును; జ్ఞానం — తెలియుటయును; అసమ్మోహః — మోహరాహిత్యమును; క్షమా—ఓర్పును; సత్యం—యథార్థమును; దమః—బాహ్యేంద్రియనిగ్రహమును; శమః—అంతరింద్రియనిగ్రహమును; సుఖం — సుఖమును; దుఃఖం—సంతాపమును; భవ —ఉత్పత్తియును; అభావః—నాశమును; భయం—భయమును, అభయంచ — భయములేకపోవుటయును; అహింసా—ప్రాణిహింస లేకపోవుటయు; సమతా—సమత్వమును,తుష్టిః—సంతోషమును;తపః—తపస్సును;దానం—ఇచ్చుటయు; యశః—కీర్తియు, అయశః—అపకీర్తియు (ఈరీతి కారముగా), భూతానాం—ప్రాణులకు. పృథగ్విధాః—నానావిధములయిన; భావా —ఈ చెప్పబడిన బుద్ధ్యాదులు, మత్తఏవ—నావలననే; భవంతి—కలుగుచున్నది.

బుద్ధి జ్ఞానము మోహములేకపోవుట ఓర్పు సత్యము బాహ్యేంద్రియ నిగ్రహము అంతరింద్రియ నిగ్రహము శాంతి సుఖదుఃఖములు ఉత్పత్తినాశములు భయము భయములేకపోవుట హింసచేయక పోవుట సమబుద్ధిత్వము సంతుష్టి తపస్సు దానము కీర్తి అపకీర్తి ఈ పలువిధములయిన గుణములు ప్రా

గినసమూహములకు నా చేతనే గలుగుచున్నది.

మహర్షయస్సప్తపూర్వే చత్వారోమనవస్తథా।
మద్భావామానసాజాతా యేషాంలోకఇమాఃప్రజాః. 6

పూర్వే-అతీతకాలసంబంధులగునట్టి; సప్త- ఏడుగురగునట్టి; మహర్షయశ్చ-భృగ్వాదిమహర్షులును; తథా - ఆలాగుననే; చత్వారః-నలుగురగునట్టి సనకాదులును; మనవశ్చ- స్వాయంభువాదిమనువులును, మద్భావాః-మద్గతభావనులై; మానసాః-మనస్సుచేత బుట్టింపబడినవారలై. జాతాః - పుట్టిరి; యేషాం-ఎవరివలన; లోకే - లోకమందు ఇమాః- ఈచరాచరరూపములైన. ప్రజాః-ప్రజలు; జాతాః-పుట్టిరో.

మరియు భృగ్వాది మహర్షి సప్తకము సనక సనందనాదిచతుష్టయము, స్వాయంభువాది మనువులు బ్రహ్మాత్మకంబగు నావల్ల మద్గతభావముగలవారై జన్మించిరి. ఈ యెల్లలోకములయందు చరాచర రూపములయిన భూతములు పుట్టెను.

ఏతాం విభూతిం యోగంచ మమయో వేత్తితత్త్వతః।
సోఽవికంపేనయోగేన యుజ్యతేనాత్రసంశయః. 7

యః-ఎవ్వడు; ఏతాం -ఈ; మమ-నాయొక్క, విభూతిం- విస్తారమును; యోగంచ-యోగమును; తత్త్వతః - యథార్థముగా; వేత్తి - తెలియుచున్నాడో; సః- వాడు; అవికం

పేన-చలించనట్టి; యోగేన-యోగముచేత; యుజ్యతే- కూర్చబడుచున్నాడు; అత్ర-ఈయర్థమందు; సంశయః- సందేహము; నాస్తి-లేదు.

ఎవడయితే ఈ పైఁ జెప్పిన నావిభూతిని న్ని యోగమహిమనున్ను చక్కఁగా తెలిసికొనునో వాఁడు చలింపని యోగసిద్ధిని నిస్సంశయముగా జెందుచున్నాడు.

అహంసర్వస్యప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే।
ఇతిమత్వాభజంతేమాం బుధాభావసమన్వితాః. 8

అహం-నేను; సర్వస్య-సమస్తమగు జగత్తునకు, ప్రభవః-ఉత్పత్తికారణమైనవాడను; మత్తః-నావలన; సర్వం-సమస్తము; ప్రవర్తతే-ప్రవర్తించుచున్నది; ఇతి- ఈప్రకారము; మత్వా-తలచి; బుధాః-పండితులు, భావ సమన్వితాస్సంతః-భావముతోఁ గూడినవారలగు; మాం -నన్ను, భజంతే- సేవించుచున్నారు.

యెల్లసృష్టికీ ఉత్పత్తికారణమగునవాడను నేనే నామహిమవల్లనే యెల్లప్రపంచములు జరుగుచున్నవి. పండితులునాభావమును ఈవిధముగా యెఱిగినవారై నన్ను కొలుచుచున్నారు.

మచ్చిత్తామద్గతప్రాణా. బోధయంతఃపరస్పరమ్।
కథయంతశ్చమాంనిత్యం తుష్యంతిచరమంతిచ. 9

మచ్చిత్తాః-నాయందు మనస్సు గలవారలు; మద్గత ప్రా
ణాః-నన్నుబొందిన ప్రాణములుగలవారలయి; పరస్పరం- అ
న్యోన్యముగా; బోధయంతః - తెలియజేసుకొనుచున్నవారల
యి; మాం-నన్ను; కథయంతః- కీర్తించుచున్నవారలయి: ని
త్యం-ఎల్లప్పుడును; తుష్యంతిచ - సంతోషించుచున్నారు;ర
మంతిచ-క్రీడించుచున్నారు.

మరియు పండితులు నాయందుచిత్తముగలవారై నాయం
దే ప్రాణములు అప్పగించినవారై నా స్వభావమహిమలను తా
మెరింగి ఒకరి కొకరు ఉపదేశము చేసికొనుచు నాకథామృత
ము వలన సంతుష్టులై బ్రహ్మానందమనుభవించుచున్నారు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్।
దదామిబుద్ధియోగంతం యేనమాముపయాంతి తే॥ 10

సతతయుక్తానాం-నిత్యయుక్తులైన; ప్రీతిపూర్వకం- విశ్వా
సపూర్వకముగా. భజతాం-సేవించుచున్న; తేషాం- వారల
కు; తంబుద్ధియోగం-ఆజ్ఞానయోగమును. దదామి- ఇచ్చుచు
న్నాను, యేన-ఏబుద్ధియోగముచేత, తే-వారలు; మాం - న
న్ను; ఉపయాంతి-పొందుచున్నా

ఈ విధముగ యెల్లెడల నాయందాసక్తిగలిగి విశ్వాసపూ
ర్వకముగ సేవించెడు మహాత్ములకు నాలో ఐక్యమునకు కార

ణమయిన జ్ఞానయోగమును నేను యిచ్చెదను.

తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజంతమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేనభాస్వతా 11

తేషామేవ-వారలకే; అనుకంపార్థం-దయచేయుటకొరకు; ఆత్మభావస్థః-స్వాభిప్రాయమందున్న; అహం-నేను; భాస్వతా-ప్రకాశించుచున్న; జ్ఞానదీపేన-వివేకమనెడి దీపముచేత; అజ్ఞానజం-అవివేకమువలనబుట్టిన; తమః - అంధకారమును; నాశయామి-నశింపజేయుచున్నాను.

అట్టి వారికి మాత్రమే నేను దయచేసి నా సర్వవ్యాపకమయిన జ్ఞానప్రకాశముచేత వారల ప్రకృతి సంబంధమయిన అవివేకమనెడి అంధకారమును నశింపజేయుచున్నాను.

అర్జున ఉవాచ.

పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమంభవాన్।
పురుషంశాశ్వతందివ్య మాదిదేవమజంవిభుమ్. 12
ఆహుస్త్వా మృషయస్సర్వే దేవర్షి ర్నారదస్తథా।
అసితోదేవలోవ్యాస స్స్వయంచైవ బ్రవీషిమే. 13

అర్జునుడుపలుకుచున్నాడు. భవాన్-నీవు; పరం-ఉత్కృష్టమైన; బ్రహ్మ-బ్రహ్మము; పరం-ఉత్కృష్టమైన; ధామ-తేజ

స్సు; పరమం-ఉత్కృష్టమైన, పవిత్రం - పావనము; ఇదియు నుంగాక, త్వాం-నిన్ను; పురుషం-పురుషునిగా; శాశ్వతం-నిత్యమైనవానిగా; దివ్యం-ప్రకాశించుచున్నవానినిగా; ఆదిదేవం-దేవతలలో మొదటివానిగా, అజం-పుట్టుకలేనివానినిగా, విభుం-ప్రభువునుగా, ఆహుః-చెప్పుదురని యుత్తరశ్లోకముతో నన్వయము. దేవర్షిః-దేవఋషియైన, నారదశ్చ-నారదుడును; అసితః-అసితుడైన, దేవలః- దేవలుడు, తథా-అట్లుగుననే, వ్యాసః-వేదవ్యాసుడును, సర్వే-సమస్తములైన, ఋషయశ్చ-వసిష్ఠాదిఋషులును. త్వాం-నిన్ను, ఆహుః-పూర్వోక్తప్రకారముగా చెప్పుదురు; స్వయంచ-నీవును, మే-నాకొఱకు; బ్రవీషి-చెప్పుచున్నావు.

ఓ కృష్ణా! నీవు పరబ్రహ్మమనియు, పరంధాముడనియు, పరమోత్కృష్టుడనియు, పరమపావనుండనియు, పురాణపురుషుండనియు, శాశ్వతుండనియు, దివ్యమూర్తియనియు, దేవతలలో మొదటివాడనియు, పుట్టువులేనివాడనియు, ప్రభువనియు నారదుఁడును, దేవలుఁడును, అసితఋషియును, వ్యాసులును మహర్షులందరు చెప్పుదురు. నీవును ఆ విధముగానే నీ మహిమను నాకు దెలియజేయుచున్నావు.

సర్వమేతదృతంమన్యే యన్మాంవదసికేశవ।
నహితేభగవన్వ్యక్తిం విదుర్దేవానదానవాః. 14

హే కేశవ-ఓ శ్రీకృష్ణస్వామీ; మాం-నన్నుగూర్చి; యత్-ఏవాక్యమును; వదసి-చెప్పుచున్నావో; ఏతత్సర్వం-ఆయీ సమస్తమును; ఋతం-సత్యమయినదానినిగా; మన్యే-తలంచుచున్నాను; హే భగవన్-ఓ శ్రీకృష్ణస్వామీ; తే-నీయొక్క; వ్యక్తిం-మహిమను, దేవాః-దేవతలును; దానవాశ్చ-రాక్షసులును; నవిదుహిః--యెరుగరుగదా.

ఓ కృష్ణా నీవు నాకుపదేశించిన సమస్త విషయములను సత్యమని నమ్ముచున్నాను. నీమహిమను దేవతలుగాని అసురులుగాని బాగుగ తెలియజాలరు.

స్వయమేవాత్మనాత్మానం వేత్థత్వంపురుషోత్తమ।
భూతభావనభూతేశ దేవదేవ జగత్పతే. 15

భూతభావన-ప్రాణులను వృద్ధిబొందునట్టి: భూతేశ-ప్రాణులకునియామకుడైన; దేవదేవ-దేవతలకు దేవుడైన; జగత్పతే-లోకనాయకుడవైన, హే పురుషోత్తమ-శ్రీకృష్ణస్వామీ; త్వం-నీవు; ఆత్మనా-నీచేత; స్వయమేవ- అస్మదాదులవలెగురూపదేశాపేక్షలేక నీవే; ఆత్మానం-నిన్ను; వేత్థ-యెరుంగుచున్నావు.

ఓ వాసుదేవా! నీవు ప్రాణులను వృద్ధిచేయువాడవు, ప్రాణులకు నియామకుడవు, దేవదేవుడవు, లోకనాయకుడవు.

పురుషశ్రేష్ఠుడవు, నీ మహాత్మ్యము తెలియఁదగినవాఁడు నీవు గాని వేఱొకఁడు లేఁడు.

వక్తుమర్హస్యశేషేణ దివ్యాహ్యాత్మవిభూతయః।
యాభిర్విభూతిభిర్లోకా నిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి. 16

ఆత్మవిభూతయః - స్వకీయములగు మాహాత్మ్యవిస్తారములు; దివ్యాహి-ప్రకాశించుచున్నవిగదా; యాభిర్విభూతిభిః- ఏ మాహాత్మ్యవిస్తారములచేత. ఇమాన్ లోకాన్ -ఈలోకములను; వ్యాప్య-వ్యాపించి; త్వం-నీవు; తిష్ఠసి-ఉన్నావో; తాః-ఆమాహాత్మ్యవిస్తారములను, అశేషేణ- నిశ్శేషముగా; వక్తుం-చెప్పుటకొరకు; అర్హసి-తగుదువు.

నీ స్వకీయమయిన మాహాత్మ్యములు అనేకముగా కనబడుచున్నవి. ఈసమస్త లోకములను, ఏమాహాత్మ్యవిస్తారములచేత నీవుసర్వమునువ్యాపించి, ప్రకాశింపజేయుచున్నావో, అవియన్నియు, సవిస్తారముగా తెలియజేయుటకు, నీవేఅర్హుడవు.

కథంవిద్యా మహంయోగిం స్త్వాంసదా పరిచింతయన్।
కేషుకేషుచ భావేషు చింత్యోసి భగవన్మయా. 17

హే యోగిన్-శ్రీకృష్ణస్వామీ; అహం-నేను; కథం - ఎట్లు; త్వాం-నిన్ను; సదా-ఎల్లప్పుడును; పరిచింతయన్-ధ్యానముజేయుచున్నవాడనై; విద్యాం-తెలియుదును; హేభగవన్-

ఓ శ్రీకృష్ణస్వామీ; కేషుకేషుచభావేషు-ఏయే వస్తువులయం దు; మయా-నాచేత; చింత్యః - ధ్యానముజేయదగినవాడవు; అసి-అగుచున్నావు.

ఓ ఈశ్వర నిన్ను ఎన్నిపూటలయందును నీవిధముగ ధ్యానముజేసి యెరుగగలను. నీవు ఏ యే స్వరూపములు గలవాడవుగా ధ్యానము చేయుటకు తగినవాడవు.

విస్తరేణాత్మనోయోగం విభూతించ జనార్దన।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తిమేఽమృతమ్. 18

హే జనార్దన - ఓ శ్రీకృష్ణస్వామీ; ఆత్మనః - నీయొక్క; యోగం-యోగమును, విభూతించ - ఐశ్వర్యమును; విస్తరేణ-విస్తారముచేత; భూయః-మరల; కథయ-చెప్పుము; అమృతం-మీ వాక్యామృతమును; శృణ్వతః-వినుచున్న; మే-నాకు; తృప్తిః-తనివి; నాస్తిహి-లేదుగదా.

ఓ జనార్దన! నీ సర్వజ్ఞత్వ విభూతి విస్తారములను చక్కగా మరల నాకు సెలవిమ్ము. నీ వాక్యామృత ధారలు ఎంత ఆలకించినప్పటికిని నాకు తృప్తిలేదు.

శ్రీ భగవాన్ ఉవాచ.

హంతతే కథయిష్యామి దివ్యాహ్యాత్మ విభూతయః।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్యమే. 19

శ్రీకృష్ణవాక్యము. హే కురుశ్రేష్ఠ-ఓయిఅర్జున; హంత-ఓయి అని దయతోఁగూడిన సంబోధన; దివ్యాః-ప్రకాశించుచున్న; ఆత్మవిభూతయః - స్వకీయమయిన మాహాత్మ్యవిస్తారములేవికలవో వానిని; ప్రాధాన్యత - ముఖ్యముగా; తే- నీకొఱకు; కథయిష్యామి - చెప్పఁగలను; మే - నాయొక్క; విస్తరస్య-మాహాత్మ్యవిస్తారమునకు; అంతః-తుద; నాస్తి-లేదు.

ఓ అర్జున! నా మహాత్మ్యములు అనేకములుగా వున్నయవి. వాటిని లెక్క పెట్ట నలవికాదు. అయినను వాటిలో ముఖ్యములయిన కొన్నిటిని నీకు గాను చెప్పెదను ఆలకింపుము.

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః।
అహమాదిశ్చ మధ్యంచ భూతానామంతఏవచ. 20

ఓ అర్జున! ఎల్లభూతముల మనస్సులయందున్న పరమాత్మస్వరూపిని నేనేను. ఎల్ల భూతముల ఉత్పత్తి, స్థితి, నాశములకు కారణభూతుఁడను నేనేను.

ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్।
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ. 21

ద్వాదశాదిత్యులలో విష్ణువనే ఆదిత్యుఁడు నేనే, జ్యోతిస్వరూపములలో కిరణములుగల సూర్యుఁడు నేనే. వాయువు

లలో మరీచియను వాయువు నేనే, నక్షత్రములలో చంద్రుడు నేనేను.

వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః।
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా. 22

వేదములలో సామవేదము నేనే, దేవతలలో దేవేంద్రుడు నేనే, ఇంద్రియములలో మనస్సు నేనే, ప్రాణులలో బుద్ధి నేనేను.

రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్।
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్. 23

ఏకాదశరుద్రులలో శంకరుడు నేనే, యక్షరాక్షసగణములలో కుబేరుడు నేనే. అష్టవసువులలో అగ్నిహోత్రుడు నేనే, గొప్పకొండలలో మేరుపర్వతము నేనేను.

పురోధసాంచ ముఖ్యంమాం విద్ధిపార్థ బృహస్పతిమ్।
సేనానీనా మహంస్కంద స్సరసామస్మి సాగరః. 24

ఓ అర్జున! పురోహితులలో దేవపురోహితుడైన బృహస్పతి నేనే, సేనాధిపతులలో కుమారస్వామి నేనే, తటాకములలో సముద్రుడు నేనేను.

మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్।
యజ్ఞానాంజపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః. 25

మహర్షులలో భృగువు నేనే, వాక్కులలో ప్రణవమునేనే, యజ్ఞములలో జపయజ్ఞము నేనే, స్థావరములలో హిమవత్పర్వతము నేనేను.

అశ్వత్థ స్సర్వ వృక్షాణాం దేవర్షీణాంచనారదః।
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలోమునిః. 26

వృక్షములలో అశ్వత్థవృక్షము నేనే, దేవఋషులలో నారదుఁడు నేనే గంధర్వులలో చిత్రరథుఁడు నేనే, సిద్ధులలో కపిలమహాముని నేనేను.

ఉచ్చైశ్రవ సమశ్వానాం విద్ధిమామ మృతోద్భవమ్।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాంచ నరాధిపమ్. 27

అశ్వములలో అమృతముతో బుట్టిన ఉచ్చైశ్రవము నేనే, గజశ్రేష్ఠులలో ఐరావతము నేనే, మనుష్యులలో రాజును నేనేను.

ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మికామధుక్
ప్రజనశ్చాస్మి కంనర్ప స్సర్పాణా మస్మివాసుకిః. 28

ఆయుధములలో వజ్రాయుధము నేనే, గోవులలో కామధేనువు నేనే, ప్రాణులను పుట్టించే కాముణ్ని నేనే, సర్పనమూహములలో రాజయిన వాసుకి నేనేను.

అనంతశ్చాస్మి నాగానాం వరుణోయాదసామహమ్।
పితౄణా మర్యమాచాస్మి యమస్సంయమతా మహమ్.

నాగుపాములలో అనంతుడను నేనే, జలదేవతలలో వరుణుడు నేనే, పితృదేవతలలో ఆర్యముడు నేనే, దండించు వారలలో యముడు నేనేను.

ప్రహ్లాదశ్చాస్మిదైత్యానాం కాలః కలయతామహమ్।
మృగాణాంచ మృగేంద్రోహం వైనతేయశ్చపక్షిణామ్.

రాక్షసులలో ప్రహ్లాదుడు నేనే, గణకులలో కాలము నేనే, మృగములలో సింహము నేనే, పక్షులలో గరుత్మంతుడు నేనేను.

పవనః పవతామస్మి రామశ్శస్త్ర భృతామహమ్।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మిజాహ్నవీ. 31

పరిశుద్ధవస్తువులలో వాయువు నేనే, ధనుర్ధరులలో దశరథరాముడు నేనే, మత్స్యము మొదలయిన జలజంతువులలో మొసలి నేనే, నదులలో గంగానది నేనేను.

సర్గాణామాదిరంతశ్చ మధ్యంచైవాహమర్జున।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్. 32

ఓ అర్జున! సృష్టులకు ఆది,స్థితి,లయములు నేనే, విద్యలలో మోక్షవిద్య నేనే, వాదించెడివారలలో వాదము నేనేను.

అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వస్సామాసికస్యచ।
అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః. 33

అక్షరములలో అకారము నేనే, సమాసములలో ద్వంద్వ సమాసము నేనే, తుదలేని కాలము నేనే, కర్మఫలదాయకుం డయిన విశ్వతోముఖుడనే బ్రహ్మనేనేను.

మృత్యుస్సర్వ హరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్।
కీర్తిశ్శ్రీర్వాక్చనారీణాం స్మృతిర్మేధాధృతిఃక్షమా. 34

సమస్త ప్రపంచములను నాశముచేయు మృత్యుదేవత నే నే, ఉత్పత్తికాగల వస్తువులకు ఉత్పత్తిస్థానము నేనే, స్త్రీల యందు కీర్తి, లక్ష్మి, వాక్కు, తెలివి, బుద్ధి, ధైర్యము, ఓర్పు, నేనేను.

బృహత్సామతథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్।
మాసానాంమార్గశీర్షోహ మృతూనాం కుసుమాకరః. 35

సామ వేదములో బృహత్సామము నేనే, ఛందస్సులలో గాయత్రీ ఛందస్సు నేనే. మాసములలో మార్గశీర్షమాసము నేనే, ఋతువులలో వసంతఋతువు నేనేను.

ద్యూతంఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్।
జయోస్మివ్యవసాయోస్మి సత్త్వంసత్త్వవతామహమ్. 36

వంచకమయిన వస్తువులలో జూదము నేనే, తేజోవంతు

ల తేజస్సు నేనే సాత్వికుల సత్వగుణము జయము దారుఢ్యము ఉద్యోగము నేనేను.

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః. 37

యాదవులలో వాసుదేవుడు నేనే, పాండవులలో అర్జునుడవయిన నీవున్ను నేనే, ఋషులలో వేదవ్యాసమహాముని నేనే, శాస్త్రార్థముల నెఱింగిన వారలలో శుక్రాచార్యులు నేనేను.

దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్. 38

శిక్షించు వారలయొక్క దండనీతి నేనే, జయించ నిచ్ఛయించినవారల జయోపాయములు నేనే, గోప్యమగు న వస్తువులలో మౌనము నేనే, జ్ఞానవంతులలో జ్ఞానము నేనేను.

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున।
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్. 39

ఓ అర్జున! సమస్తభూతములకు బీజము నేనే, నేను గాని చరాచర భూతములు లేనేలేవు.

నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా. 40

హే పరంతప- ఓ అర్జునా; మమ - నాయొక్క; దివ్యా
నాం-ప్రకాశించుచున్న; విభూతీనాం-మాహాత్మ్యవిస్తారము
లకు; అంతః-తుద; నాస్తి-లేదు; ఏషః-ఈ; విభూతేః-విభూ
తియొక్క; విస్తరస్తు-విస్తారమయితే; మయా-నాచేత; ఉద్దే
శతః-సంక్షేపముగా; ప్రోక్తః-చెప్పబడెను.

ఓ పార్థ! నా మహాత్మ్య విస్తారములకు అంత్యము లే
దు. అయినను నీకుగాను వాటిని సంగ్రహముగా తెలియఁ
జేసితిని.

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా।
తత్తదేవావగచ్ఛత్వం మమతేజోంశసంభవమ్. 41

లోకే-లోకమందు; విభూతిమత్-ఐశ్వర్యయుక్తమయిన
శ్రీమత్-కాంతియుక్తమైన; ఊర్జితమేవ-ఉత్సాహముతోగూ
డిన; యద్యత్సత్త్వం- ఏయేవస్తువుకలదో; తత్తత్-ఆయావస్తు
వు; మమ-నాయొక్క; తేజోంశసంభవమేవ-తేజోభాగసంభవ
మయినదానినిగానే; త్వం-నీవు; అవగచ్ఛ-తెలియుము.

లోకమునందు ఐశ్వర్యయుక్తమై బలపరాక్రమయుక్తమై
ఉత్సాహయుక్తమై కాంతియుక్తమై ఏ యేవస్తువులు గలవో
అవిఎల్ల నాతేజోభాగ సంభవమైనవిగా దెలిసికొనుము.

అథవాబహునైతేన కింజ్ఞాతేనతవార్జున; *
విష్టభ్యాహమిదంకృత్స్న మేకాంశేనస్థితోజగత్. 42

హే అర్జున-ఓయర్జునుడా; అథవా- అటుగాకపోయె
నేని; తవ-నీకు; బహునా-అధికమయిన; ఏతేనజ్ఞానేన; ఈజ్ఞా
నముచేత; కిం-ఏమి; అహం-నేను; ఏకాంశేన - ఒకపాదము
చేత, (అనగా సర్వభూతస్వరూపముచేతననుట); కృత్స్నం-స
మస్తమయిన; ఇదంజగత్-ఈజగత్తు; విష్టభ్య-విశేషముగా
వ్యాపించి; అస్థితః-ఉన్నాను;(ఇందుకుశ్రుతి, "పాదోస్యవిశ్వా
భూతాని-" ఈ పరమాత్మకు సమస్తమయిన ప్రపంచమును
నొకపాదమని శ్రుత్యర్థము.)

ఓ అర్జున! నామాహాత్మ్యవిస్తారములను వేర్వేరుగా వి
వరించవలసిన అవశ్యములేదు. వాటిని చక్కగా తెలియువల
సినపని నీకునులేదు. ఈ ఎల్లప్రపంచములు నా అనేక అతిశ
యములలో ఒకఅంశముచేతనే వ్యాపింపఁబడియున్నవని యె
రుగుము.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే
విభూతి యోగో నామ దశమోధ్యాయః.

---

ఉపనిషద్రూపములును, బ్రహ్మవిద్యయును, యోగ
శాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదరూపంబయిన,
విభూతియోగమనెడి దశమోధ్యాయము ముగిసినది.

---

## శ్రీ భగవద్గీత.

### విశ్వరూపసందర్శనయోగోనామ ఏకాదశోధ్యాయః.

అర్జున ఉవాచ.

మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్।
యత్త్వయోక్తం వచస్తేన మోహోయంవిగతోమమ.

అర్జునుడు చెప్పుచున్నాడు. మదనుగ్రహాయ- నన్ననుగ్రహించుటకొరకు; త్వయా-నీచేత; పరమం-ఉత్కృష్టమయిన; గుహ్యం-గోప్యమయిన; ఆధ్యాత్మసంజ్ఞితం- ఆత్మానాత్మవస్తువివేచనవిషయమయిన; యద్వచః-ఏవాక్యము; ఉక్తం-చెప్పఁబడెనో.(ఆవాక్యముచేత);మమ-నాయొక్క;అయంమోహః-ఈ అజ్ఞానము; విగతః-పోఁగొట్టఁబడెను.

నన్ను అనుగ్రహించుటకుగాను నీవు వుపదేశించిన సర్వోత్తమమైనట్టియు, రహస్యమైనట్టియు ఆత్మానాత్మవస్తు వివేకజ్ఞానమైనట్టియు ఉపదేశవాక్యమువలన నా అజ్ఞానము వదలిపోయినది.

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా। *
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్. ౨

హే కమలపత్రాక్ష - ఓ శ్రీకృష్ణస్వామీ; త్వత్తః - నీవల్లనుండి; భూతానాం - ప్రాణులయొక్క -, భవాప్యయౌ - ఉత్పత్తిప్రళయములు; విస్తరశః - విస్తారముగా; మయా - నాచేత; శ్రుతౌ - వినబడినవి; అవ్యయం - అక్షయమయిన; తే - నీయొక్క; మహాత్మ్యంచ - మాహాత్మ్యమును, శ్రుతం - వినబడెను.

ఓ కృష్ణా! నీవలన భూతసమూహముల ఉత్పత్తి నాశనములు విస్తారముగా విన్నదేగాక అక్షయమైన నీ ప్రభావమును న్ను బాగుగా వింటిని.

ఏవమేతద్యథాత్థ త్వ మాత్మానం పరమేశ్వర।
ద్రష్టుమిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ. ౩

హే పరమేశ్వర - హే పురుషోత్తమ - ఓ శ్రీకృష్ణస్వామీ; ఏతత్ - ఇది, ఏవం - ఈలాగ, (ఇందుకు వ్యత్యాసము లేదు); యథా - ఏరీతిగా, ఆత్మానం - ఆత్మస్వరూపమును, త్వం - నీవు; అత్థ - చెప్పితివో; తథా - ఆరీతిగా, పరమేశ్వరం - ఈశ్వరసంబంధమయిన; తే - నీయొక్క, రూపం - స్వరూపమును; ద్రష్టుం - చూచుటకొఱకు; ఇచ్ఛామి - ఇచ్ఛయించుచున్నాను,

ఓ పరమేశ్వర! నీవు చెప్పినది యథార్థమే. నీఆత్మస్వరూ

పము ఎట్టిదని నీవు తెలియఁజేసితివో అట్టి ప్రభావముఁగల నీ స్వరూపమును చూచుటకు నేను మిగుల కోరియున్నాను.

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్.

హే ప్రభో-హే యోగేశ్వర- ఓ శ్రీకృష్ణస్వామీ; తత్-ఆరూపము; మయా-నాచేత; ద్రష్టుం-చూచుటకొరకు; శక్యం-శక్యమయినదని; మన్యసే యది-తలంచితివేని; తతః - అతర్వాత; త్వం-నీవు; మే-నాకొరకు; అవ్యయం- శాశ్వతమైన; ఆత్మానం-నిన్ను; దర్శయ-చూపుము,

ఓ శ్రీకృష్ణ' అట్టి ప్రభావముగల నీ దివ్యరూపమునుచూచుటకు నాకు సాధ్యమని నీవు భావించితివేని నీ అవ్యయమైన స్వరూపమును నాకు చూపుము.

శ్రీభగవాన్ ఉవాచ.

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. 5

హే పార్థ-ఓ యర్జునా; నానావిధాని - అనేకప్రకారములయిన; దివ్యాని- అప్రాకృతములయిన; నానావర్ణాకృతీని-అనేకములయినవర్ణములును అవయవస్థితి విశేషములును కలిగిన; శతశః-నూరులైన; అథ - అటుపిమ్మట; సహస్రశః-

వేలసంఖ్యలైన; మే-నాయొక్క; రూపాణి-ఆకారములను; పశ్య-చూడుము.

ఓ అర్జున! దివ్యములై నానావిధములై అనేక వర్ణములై పలువిశేషములుగలవై విశేషసంఖ్యగల నా స్వరూపమును చూడుము.

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుత స్తథా।
బహూన్యదృష్ట పూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత. 6

హేభారత - ఓ యర్జునా; ఆదిత్యాన్-ద్వాదశాదిత్యులను; వసూన్-అష్టవసువులను; రుద్రాన్ - ఏకాదశరుద్రులను; అశ్వినౌ-అశ్వినీదేవతలను; తథా-అలాగుననే; మరుతః-సప్తవాయువులను; పశ్య - చూడుము; అదృష్టపూర్వాణి - ఎన్నడుజూడబడని; బహూని-అనేకములయిన; ఆశ్చర్యాణి-అద్భుతములను; పశ్య-చూడుము.

ఓ భారత! ద్వాదశాదిత్యులను అష్టవసువులను ఏకాదశరుద్రులును అశ్వినీ దేవతలను సప్త వాయువులను ఇంతవరకు నీచే జూడఁబడని అనేక సంఖ్యలుగల అద్భుతములను ఇపుడు కనుము.

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్యస చరాచరమ్।
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి. 7

హే గుడాకేశ - ఓ యర్జునుడా; అద్య-ఇప్పుడు; సచరా
చరం-జంగమస్థావరములతోఁ గూడిన; కృత్స్నం-సమస్తమైన;
జగత్-జగత్తును; మమ-నాయొక్క; ఇహ దేహే-ఈశరీరమం
దు; ఏకస్థం-ఒకప్రదేశమందున్నవానినిగా; పశ్య- చూడుము;
అన్యత్-మరియొకటైన; యచ్చ - దేనిని; ద్రష్టుం-చూచుట
కొరకు; ఇచ్ఛసి-ఇచ్ఛయించుచున్నావో; తత్-దానిని; పశ్య-
చూడుము.

ఓ అర్జునా! చరాచరంబగు సమస్త ప్రపంచమును ఏక
స్థానస్థమైన నా దివ్యదేహమున చూడుము. ఇదిగాక జయాపజ
యము మొదలగు ఏ యే అంశములను నీవుచూడఁదలచియు
న్నావో వాటినన్నిటిని చూడుము.

న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్. 8

అనేన-ఈప్రాకృతమైన; స్వచక్షుషైవ - నీనేత్రముచేతనే;
మాం-నన్ను; ద్రష్టుం-చూచుటకొరకు; నశక్యసే- శక్తుడవు
కావు; దివ్యం-అప్రాకృతమయిన; చక్షుః - నేత్రమును; తే-
నీకొరకు; దదామి-ఇచ్చుచున్నాను; ఐశ్వరం - ఈశ్వరసంబం
ధమయిన; మే-నాయొక్క; యోగం-శక్తిని; పశ్య-చూడుము.

ఈ ప్రాకృతములైన నీ కన్నులతో నా దివ్య స్వరూపమును

చూడజాలవు, నీకు దివ్యదృష్టిని ఇచ్చుచున్నాను, దానిచే ఐశ్వర్యమైన నా యోగశక్తిని చూడుము.

సంజయ ఉవాచ.

ఏవముక్త్వాతతో రాజన్ మహాయోగేశ్వరోహరిః।
దర్శయామాసపార్థాయ పరమంరూపమైశ్వరమ్.　　9

సంజయుడు చెప్పుచున్నాడు. హేరాజన్-ఓయి ధృతరాష్ట్రుడా; మహాయోగేశ్వరః-అధికమయిన యోగములకు ప్రభువైన; హరిః-శ్రీకృష్ణస్వామి; ఏవం-ఈప్రకారముగా; ఉక్త్వా-పలికి; తతః-ఆపిమ్మట; పార్థాయ - అర్జునునికొరకు; పరమం-ఉత్కృష్టమయిన; ఐశ్వరం-ఈశ్వరసంబంధమైన; రూపం-విశ్వరూపమును; దర్శయామాస-చూపెను.

ఓ ధృతరాష్ట్రా! మహాయోగియైన శ్రీకృష్ణుడు పై చెప్పినట్లు పలికి సర్వోత్కృష్టమై దివ్యమయిన తన విశ్వరూపమును అర్జునునికిగాను చూపెను.

అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనం।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధం.　　10

అనేకవక్త్రనయనం-అనేకములయిన ముఖములును నేత్రములునుగలిగిన; అనేకాద్భుత దర్శనం - బహువిధములైన

యాశ్చర్యములను జూపుచున్న; అనేకదివ్యాభరణం- అనేకదివ్యభూషణములుకలిగిన; దివ్యానేకోద్యతాయుధం- దివ్యములై యనేకములై యెత్తబడియున్న యాయుధములు గలిగియున్నట్టి (రూపమును చూపెనని భావము.)

ఆరూపము అనేకముఖములతోను, నేత్రములతోను, అద్భుతములతోను, దివ్యాభరణములతోను, ఆయుధములతోను, కూడుకొనియుండెను.

దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనం।
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖ 11

దివ్యమాల్యాంబరధరం - అప్రాకృతములైనమాల్యములను వస్త్రములను ధరించియున్న; దివ్యగన్ధానులేపనం-దివ్యగంధలేపనముగల్గిన; సర్వాశ్చర్యమయం- సమస్తాశ్చర్య రూపమైన; విశ్వతోముఖం- అంతటముఖములుగలిగిన; అనంతం-అపరిచ్ఛిన్నమైన; దేవం- శ్రీభగవంతుని, (అర్జునుడుచూచెను.)

మఱియు దివ్యములయిన హారములతోను, వస్త్రములతోను, పరిమళములయిన గంధములతోను కూడుకొని ఎల్లెడల ముఖములుగలదై ఆశ్చర్యమై అంతములేనిదైన స్వరూపమును అర్జునుడు కనెను.

దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా।
యదిభా స్సదృశీ సాస్యా ద్భాస స్తస్య మహాత్మనః. 12

దివి–ఆకాశమందు; సూర్యసహస్రస్య – సహస్రసూర్యుల యొక్క; భాసః- కాంతి; యుగపత్ – ఏకకాలమందు; ఉత్థితా–ఎగిసినది; భవేద్యది–ఆయెనేని; సా– ఆకాంతి; తస్యమహాత్మనః–ఆమహాత్మునియొక్క; భాసః–కాంతికి; సదృశీ–సమానమైనది; స్యాత్–అగును.

ఆ దివ్యరూపముయొక్క కాంతి ఏకకాలమున వేయిసూర్యులు ఆకాశమందు ప్రకాశించిన ఎంత కాంతిగ నుండునో దానికి సమానముగా నుండెను.

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా।
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా. 13

అనేకధా–బహుప్రకారములుగా; ప్రవిభక్తం– ఏర్పరచబడిన; కృత్స్నం–సమస్తమైన; జగత్–జగత్తు, దేవదేవస్య–శ్రీకృష్ణస్వామియొక్క; తత్ర – ఆశరీరమందు; ఏకస్థం – ఒకచక్కనున్నదానినిగా; తదా– అప్పుడు; పాండవః–అర్జునుడు; అపశ్యత్–చూచెను.

అనేక ప్రకారములుగా పలువిధములుగా ఏర్పరచియుండే ఎల్లజగత్తులు దేవదేవుడయిన శ్రీకృష్ణుని దేహమందు ఒక

టిగా చేరియున్న వాటిని అర్జునుఁడు చూచెను.

తతస్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః।
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత. 14

తతః-అనంతరము; ధనంజయః- అర్జునుడు; విస్మయావిష్ట స్సన్-ఆశ్చర్యముతోఁ గూడినవాఁడయి; హృష్టరోమా- గగ్గురుపాటుచెందిన వెంట్రుకలు గలవాఁడయి; దేవం- విశ్వరూపధరుఁడయిన శ్రీకృష్ణస్వామిని; శిరసా-శిరస్సుచేతను; ప్రణమ్య-నమస్కరించి; కృతాంజలిః- చేయఁబడిన అంజలి గలవాఁడయి; అభాషత-పలికెను.

అపుడు అర్జునుఁడు చిత్తభ్రాంతినొంది శరీరమున గగుర్పాటుచెందినవాఁడయి విశ్వరూపధరుఁడయి శ్రీకృష్ణునికి నమస్కరించి చేతులుజేర్చి ఈక్రింద జెప్పిన విధమున పలికెను.

అర్జున ఉవాచ,

పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూత విశేషసంఘాన్।
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీంశ్చసర్వా నురగాంశ్చదివ్యాన్. 15

హేదేవ- ఓశ్రీకృష్ణస్వామి; తవ-నీయొక్క; దేహే- దేహ

మందు; దేవాన్ - దేవతలనున్ను; తథా-అలాగుననే; సర్వాన్ - సమస్తములయిన; భూతవిశేషసంఘాన్ - ప్రాణికోట్లను; కమలాసనస్థం-కమలమందున్న; ఈశం-ప్రభువయిన; బ్రహ్మాణం- చతుర్ముఖబ్రహ్మనున్ను; సర్వాన్-సమస్తములయిన; ఋషీన్- ఋషులనున్ను; దివ్యాన్ - దివ్యములయిన; ఉరగాన్- వాసుకి మొదలయిన సర్పములను; పశ్యామి- చూచుచున్నాను.

ఓ దేవా! నీశరీరమునందు ఎల్లదేవతలు ప్రాణికోట్లు కమలము ఆసనముగా గల చతుర్ముఖ బ్రహ్మ ఎల్ల ఋషులు దేవసర్పములయినవాసుకి మొదలుగాగలవారు అగబడుచున్నారు.

అనేకబాహూదరవక్త్ర నేత్రం
పశ్యామిత్వాంసర్వతో<sup></sup>నంతరూపం।
నాంతంనమధ్యం నపునస్తవాదిం
పశ్యామివిశ్వేశ్వర విశ్వరూపమ్. 16

విశ్వేశ్వర-విశ్వనియామకుడవై; హేవిశ్వరూప- విశ్వరూపధరుడవైనయోస్వామీ; అనేకబాహూదరవక్త్రనేత్రం-అనేకములైనబాహువులున్ను ఉదరములున్ను ముఖములున్ను నేత్రములుకలిగిన; త్వాం-నిన్ను; సర్వతః- అంతటనున్ను; అనంతరూప-అనంతాకారములుగలవానిగాను; పశ్యామి- చూచుచున్నాను; పునః-తిరిగిన్ని; తవ-నీయొక్క; ఆదిం- మొద

లున్ను; మధ్యం-మధ్యమున్ను; అంతం-తుదయున్ను; నపశ్యామి-కానను.

జగములకు నియామకుడయిన ఓ ఈశ్వర, నీ విశ్వరూపమునకు అనేక బాహువులు, ఉదరములు, ముఖములు, కన్నులు గలిగియున్నవి. నీ రూపము మిగుల యెల్లెడల వ్యాపించియున్నది. అయినను నీ ఆకారమునకు చివర, మొదలు, మధ్యభాగము నాకగపడలేదు.

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా
ద్దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్. 17

కిరీటినం-కిరీటముగలిగినట్టిన్ని; గదినం-గదగలిగినట్టిన్ని; చక్రిణం-చక్రముగలిగినట్టిన్ని; తేజోరాశిం-కాంతిపుంజముగనుకనే; సర్వతోదీప్తిమంతం-అంతట ప్రకాశముగలిగినట్టిన్ని; దుర్నిరీక్ష్యం-కష్టముచేత చూడశక్యుడవైనట్టి; దీప్తానలార్కద్యుతిం-ప్రకాశించుచున్న అగ్నిసూర్యులకాంతివంటికాంతిగలిగినట్టి; అప్రమేయం-అపరిచ్ఛేద్యుడవైనట్టి; త్వాం-నిన్ను; సమంతాత్-అంతటను; పశ్యామి-చూచుచున్నాను.

కిరీటమును గదాచక్రములను దాల్చిన నీవిశ్వరూపము కాంతిచే నిండినదియై అగ్నిసూర్యులకు సాటిగ అంతటను రగులుచున్నది. అపరిచ్ఛేద్యమయిన నీస్వరూపము గనుటకు మిగుల అశక్యముగ నున్నది.

త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్యవిశ్వస్య పరంనిధానమ్।
త్వమవ్యయశ్శాశ్వతధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే. 18

త్వం—నీవు; పరమం—ఉత్కృష్టమయిన; అక్షరం – పరంబ్రహ్మమని; వేదితవ్య – తెలియదగిన; త్వం – నీవు; అస్యవిశ్వస్య—ఈజగత్తునకు; పరం—ఉత్కృష్టమయిన; నిధానం – ఆశ్రయము; త్వం—నీవు; అవ్యయం– నాశరహితుడవున్న. శాశ్వతధర్మగోప్తా—స్థిరమగుధర్మరక్షకుడవున్న; త్వం—నీవు; సనాతనః-పురాణుడైన; పురుషః—పురుషుడని; మే—నాయొక్క; మతః—మతము.

ఓ ఈశ్వర! నీవు పరమోత్కృష్టమయిన పరబ్రహ్మమనియు, యెల్ల జగములకు ఉత్కృష్టమయిన ఆశ్రయమనియు, నశింపనివాడనియు, ఊర్జితములయిన ధర్మరక్షకుడవనియు, పురాణపురుషుడవనియు తెలియఁదగినవాడవు.

అనాదిమధ్యాంతమనంతవీర్య
మనంతబాహుంశశిసూర్యనేత్రం।
పశ్యామిత్వాందీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపంతమ్. 19

అనాదిమధ్యాంతం- మొదలు నడుము తుదలేనట్టిన్ని; అనంతవీర్యం - అపరిమితపరాక్రమముగలిగినట్టిన్ని; అనంతబాహుం-అపరిమితములైన బాహువులు గలిగినట్టి; శశి సూర్యనేత్రం-చంద్రసూర్యులే నేత్రములుగా గలిగినట్టిన్ని; దీప్తహుతాశనవక్త్రం-ప్రకాశించుచున్న అగ్నివంటి ముఖముగలిగిన; త్వాం-నిన్ను; స్వతేజసా-నిజతేజముచేత; ఇదంవిశ్వం-ఈప్రపంచమును; తపంతం-తపింపుచున్నవానిగా; పశ్యామి - చూచుచున్నాను.

ఓ దేవా! నీవు ఆదిమధ్యాంతములు లేనివాడవై అపరిమిత బలముగలవాడవయి అనేక బాహువులుగలిగి సూర్యచంద్రులను కన్నులుగానుంచుకొని రగులుచున్న నిప్పే ముఖమునందు గలవాడవయి యీ ఎల్లలోకములను నీకాంతిచే తపింపచేయువాడవుగా నాకగబడుచున్నావు.

ద్యావాపృథివ్యోరిద మంతరంహి
వ్యాప్తంత్వయైకేనదిశశ్చ సర్వాః

దృష్ట్వాద్భుతంరూప ముగ్రంతవేదం
లోకత్రయంప్రవ్యథితంమహాత్మన్. 20

ఏకేన-ఒక్కడైన; త్వయా-నీచేత; ద్యావాపృథివ్యోః-భూమ్యాకాశములయొక్క; ఇదమంతరం- ఈ ఆకాశము; వ్యాప్తం-వ్యాపించబడెనుగదా; సర్వాదిశః- సమస్తదిక్కులున్ను; వ్యాప్తా - వ్యాపించబడినవి; హేమహాత్మన్-ఓయిమహానుభావా; అద్భుతం - ఆశ్చర్యమయిన; ఉగ్రం - భయంకరమయిన; తవ-నీయొక్క; ఇదంరూపం-ఈరూపమును; దృష్ట్వా-చూచి; లోకత్రయం - మూడులోకములున్ను; ప్రవ్యథితం-భయపడుచున్నవి.

నీ వొక్కని రూపముచే భూమి, ఆకాశము, అంతరాళము అన్నియు వ్యాపింపబడి యున్నది. ఎల్లదిక్కులు వ్యాపించిన ఓ మహానుభావా! ఆశ్చర్యముగాను అతిభయంకరముగా నుండు నీ రూపమును చూచి స్వర, మర్త్య, పాతాళ, లోకములు మూడును వణుకుచున్నవి.

అమీహిత్వాంసురసంఘా విశంతి
కేచిద్భీతాఃప్రాంజలయోగృణంతి
స్వస్తీత్యుక్త్వామహర్షిసిద్ధసంఘాః
స్తువంతిత్వాంస్తుతిభిఃపుష్కలాభిః. 21

అమీ - ఈయుద్ధభూమిని పొందియున్న; సురసంఘాః - భూభారనివారణకొఱకు, మనుష్యులయిపుట్టియున్న, వస్వాదిదేవసమూహములు; త్వాం - నిన్ను; విశంతి - ప్రవేశించుచున్నారు, అనగా నీయందు కనుపడుచున్నారనుట; కేచిత్ - వారిలోకొందఱు; భీతాః - భయపడినవారలయి; ప్రాంజలయః - బద్ధాంజలులయి; గృణంతి - స్తుతించుచున్నారు; మహర్షిసిద్ధసంఘాః - మహర్షిసిద్ధసమూహములు; స్వస్తి - క్షేమము; అస్తు - అవుగాక; ఇతి - ఇట్లని; ఉక్త్వా - పలికి; పుష్కలాభిః - సంపూర్ణములయిన; స్తుతిభిః - స్తోత్రములచేత; త్వాం - నిన్ను; స్తువంతి - స్తోత్రముచేయుచున్నారు.

నీ దివ్యరూపమగు నవిశ్వరూపమునందు దేవసమూహములు శరణము చెందుచున్నవి. అందులో కొందఱు భయము పొంది చేతులు మోడ్చి నిన్ను స్తుతించుచున్నారు. గొప్ప ఋషులు, సిద్ధులు నీకు జయమగు వాక్యములు చెప్పుచు నిన్ను బహువిధములగు పూర్ణముగ స్తోత్రము చేయుచున్నారు.

రుద్రాదిత్యా వసవో యేచ సాధ్యా
విశ్వేశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ।
గంధర్వయక్షాసురసిద్ధసంఘా
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే. 22

రుద్రాదిత్యాః— ఏకాదశరుద్రులున్ను ద్వాదశాదిత్యులున్ను; వసవః—అష్టవసువులున్ను; యే— ఏవరు; సాధ్యాః— సాధ్యులో; తేచ—వారున్ను; విశ్వే—విశ్వేదేవతలును; అశ్వినౌ—అశ్వినీ దేవతలున్ను; మరుతశ్చ—మరుత్తులున్ను, ఊష్మపాశ్చ; పితృ దేవతలున్ను; గంధర్వయక్షాసుర సిద్ధసంఘాః - గంధర్వయక్ష రాక్షసిద్ధసమూహములున్ను; సర్వే— వీరందరును; విస్మితాస్సంతః—ఆశ్చర్యమును పొందినవారలయి, త్వామేవ- నిన్నే; వీక్షంతే—చూచుచున్నారు.

ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినీ దేవతలు, సప్తవాయువులు, పితృ దేవతలు, గంధర్వ యక్ష రాక్షస సిద్ధ సమూహములు ఆశ్చర్యముతో నిన్నే చూచుచున్నారు.

> రూపంమహత్తే బహువక్త్రనేత్రం
> మహాబాహోబహుబాహూరుపాదం।
> బహూదరం బహుదంష్ట్రాకరాళం
> దృష్ట్వాలోకాః ప్రవ్యథితా స్తథాహమ్. 23

హే మహాబాహో! ఓ శ్రీకృష్ణస్వామీ; బహువక్త్రనేత్రం—అనేకములయిన ముఖములున్ను నేత్రములును కలిగినట్టిన్ని; బహుబాహూరుపాదం - అనేకములయిన బాహువులు

న్ను తొడలున్ను పాదములున్ను కలిగినట్టిన్ని; బహూదరం-అనేకములయిన కడుపులు గలిగినట్టిన్ని; బహుదంష్ట్రాకరాళం-అనేకములయిన కోరలచేతభయంకరమయినట్టిన్ని; మహత్-అధికమయినట్టి; తే-నీయొక్క; రూపం - ఆకారమును; దృష్ట్వా-చూచి; లోకాః-ప్రాణులు; ప్రవ్యథితాః- భయపడుచున్నారు; తథా- ఆలాగుననే; అహం-నేనున్ను; ప్రవ్యథితః-భయపడుచున్నాను.

పెక్కు ముఖములు కండ్లు, చేతులు, తొడలు, పాదములు, కడుపులు ఘోరమయిన కోరలుగల నీగొప్ప ఆకారమును కని ఎల్ల ప్రాణులును నేనును మిగుల వెఱపు చెందియున్నారము.

నభస్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననందీప్త విశాలనేత్రమ్।
దృష్ట్వాహి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతింనవిందామి శమంచవిష్ణో. 24

హే విష్ణో - ఓకృష్ణస్వామీ; నభఃస్పృశం-ఆకాశమును తాకుచున్నట్టిన్ని; దీప్తం-మండుచున్నట్టిన్ని; అనేకవర్ణం-నానావర్ణములు గలిగినట్టిన్ని; వ్యాత్తాననం- తెరవబడినముఖములు గలిగినట్టిన్ని;దీప్తవిశాలనేత్రం-ప్రకాశింపుచున్నగొప్ప

కన్నులు గలిగినట్టి; త్వాం-నిన్ను; దృష్ట్వా- చూచి; ప్రవ్యథి తాంతరాత్మా-భయపడినమనస్సుగలిగిననేను; ధృతిం-ధైర్య మును; నవిందామి- పొందకయున్నాను; శమంచ-మనస్తుష్టి ని; నవిందామి- పొందకయున్నాను.

ఆకాశమును తాకునట్టియు ప్రజ్వలించునట్టియు పెక్కురంగులు కలిగినట్టియు తెరవఁబడియుండు నోళ్లు కలిగినట్టియు ప్రకాశించెడు విశాలమయిన కన్నులు గలిగినట్టియు నీ రూపమును జూచి నామనస్సు భయమునొంది యున్నది గాన నాకు ధైర్యము సంతుష్టి లేకయున్నది.

దంష్ట్రాకరాళానిచ తేముఖానిదృష్ట్వైవ కాలానలసన్నిభాని।
దిశోనజానేనలభేచశర్మ ప్రసీద దేవేశజగన్నివాస. 25

దంష్ట్రాకరాళాని - కోరలచేతభయంకరములయినట్టి; కాలానలసన్నిభాని - ప్రళయాగ్ని సమానములయినట్టి; తే - నీ యొక్క; ముఖాని-ముఖములను; దృష్ట్వా-చూచి; దిశః-దిక్కులను; నజానే-తెలియకయున్నాను; శర్మచ- సుఖమునున్ను; నలభే -పొందకయున్నాను; జగన్నివాస - జగదాధారుడవయిన; హే దేవేశ - దేవదేవుడవయిన ఓ స్వామీ; త్వం-నీవు; ప్రసీద - ప్రసన్నుడవగుము.

కోరములచే భయంకరములయి ప్రళయాగ్ని సమానము

లయిన నీ ముఖములను చూచుటవలన నాకు దిక్కులు తెలి యకయున్నది, నాకు సుఖములేకయున్నది జగత్తున కాధారు డయిన ఓదేవ నాయందుదయచేసి నాకు ప్రసన్నుడవగుము.

అమీచత్వాం ధృతరాష్ట్రస్యపుత్రాః
సర్వేసహైవావనిపాలసంఘైః।
భీష్మోద్రోణస్సూతపుత్రస్తథాసౌ
సహాస్మదీయైరపియోధముఖ్యైః. 26

వక్త్రాణితేత్వరమాణావిశంతి
దంష్ట్రాకరాళానిభయానకాని
కేచిద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతేచూర్ణితైరుత్తమాంగైః. 27

అవనిపాల సంఘైస్సహైవ - భూపాల సమూహములతో గూడనే; సర్వే-సమస్తులయిన; అమీ-ఈ; ధృతరాష్ట్రస్యపుత్రాః-ధార్తరాష్ట్రులును; భీష్మః-భీష్మాచార్యుడును; ద్రోణశ్చ-ద్రోణాచార్యుడును; తథా- ఆప్రకారముగా; అసౌ-ఈ; సూతపుత్రః - కర్ణుడున్ను; అస్మదీయైః- నాసంబంధులయిన, దృష్టద్యుమ్నుడు మొదలుగా గలిగిన; యోధముఖ్యైస్సహ-యోధాగ్రేసరులతోగూడ; త్వాం-నిన్ను; ప్రవేశించుచున్నారని యుత్తరశ్లోకముతోడ నన్వయము. ఏతే-ఈదుర్యో

ధనాదులు; త్వరమాణాస్సంతః - త్వరతో గూడినవారయి; దంష్ట్రాకరాళాని - కోరలచేతవికృతములయినట్టి; భయానకాని-భయంకరములయినట్టి; తే-నీయొక్క; వక్త్రాణి-ముఖములను; విశంతి - ప్రవేశింపుచున్నారు; కేచిత్-వారిలో కొందరు; దశనాంతరేషు - దంతములసందులయందు; విలగ్నాస్సంతః-చిక్కినవారయి; చూర్ణితైః - పొడిగాచేయబడిన; ఉత్తమాంగైః - శిరస్సులతో గూడ; సందృశ్యంతే - కనుపడుచున్నారు.

ఈ ధృతరాష్ట్రకుమారులయిన దుర్యోధనాదులు భూపాలక రాజసమూహములు భీష్మద్రోణులు కర్ణుడు నా సేనానాయకులు గుమిగూడి అతివేగముగలవారై కోరలుగలిగి భయంకరములయిన నీ ముఖములందు ప్రవేశించుచున్నారు. వారిలో గొందఱు నీ పండ్లసందులయందు జిక్కి శిరస్సులుపొడిగాచేయబడినవారయి కనుబడుచున్నారు.

యథా నదీనాం బహవోంబువేగా
స్సముద్రమేవాభిముఖా ద్రవంతి।
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి. 28

యథా-ఏప్రకారముగా; బహవః - అనేకములయిన; నదీ

నాం-నదులయొక్క; అంబువేగాః - ఉదకవేగములు; అభిము ఖాస్సంతః - సముద్రమునకు అభిముఖములై పవయు;సముద్ర మేవ-సముద్రమునే; ద్రవంతి-ప్రవేశించుచున్నవో; తథా-అ ప్రకారముగా; అమీనరలోకవీరాః - ఈశూరులు; అభివిజ్వా లంతి-అంతటప్రకాశించుచున్న; తవ-నీయొక్క; వక్త్రాణి-ము ఖములను; విశంతి-ప్రవేశించుచున్నారు.

అనేకములయిన పూర్ణ ప్రవాహనదులు మిక్కిలి వేగ ముతో సముద్రమందు ఏలాగు ప్రవేశించుచున్నవో ఆవిధ ముగ ఈశూరులందరు ప్రజ్వాలించుచున్న నీ ముఖమందు ప్ర వేశించుచున్నారు.

యథాప్రదీప్తం జ్వాలనంపతంగా
విశంతినాశాయ సమృద్ధవేగాః।
తథైవనాశాయ విశంతిలోకా
స్తవాపివక్త్రాణి సమృద్ధవేగాః. 29

పతంగాః-మిడుతలు; నాశాయ-నశించుటకొరకు; సమృద్ధ వేగాః-అధికమయినవేగముగలిగినవయి; ప్రదీప్తం-మండుచు న్న; జ్వాలనం-అగ్నిని; యథా-ఏప్రకారముగా; విశంతి-ప్రవే శించుచున్నవో; తథైవ-ఆప్రకారముగానే; లోకాః - ప్రాణు లు; నాశాయ-నశించుటకొరకు; సమృద్ధవేగాస్సంతః-అధికమై

నవేగముగలవారలై; తవ-నీయొక్క; వక్త్రాణి-ముఖములను; విశంతి-ప్రవేశించుచున్నారు.

మిడతలు రగులుచుండు నిప్పునందు అతి వేగముతో ప్రవేశించి ఏలాగు నశించుచున్నవో ఆ ప్రకారమే అనేక ప్రాణులు అతి వేగముతో నీ ముఖములయందు ప్రవేశించి నశించుచున్నారు.

లేలిహ్యసే గ్రసమాన స్సమంతా
ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో. 30

జ్వలద్భిః - మండుచున్న; వదనైః- ముఖములచేత; సమగ్రాన్-సమస్తములైన; లోకాన్ - జనములను; గ్రసమానః-మ్రింగుచున్నవాడవై; సమంతాత్-అంతటనున్న; లేలిహ్యసే-అస్వాదించుచున్నావు; హే విష్ణో - ఓ శ్రీకృష్ణస్వామీ; తవ-నీయొక్క; ఉగ్రాః-భయంకరములైన; భాసః-కాంతులు; తేజోభిః-తేజస్సులచేత; సమగ్రం-సమస్తమైన; జగత్ - జగత్తును; ఆపూర్య-నిండి; ప్రతపంతి-తపింపజేయుచున్నవి.

జ్వలించుచున్న నీ ముఖములచే ఎల్లప్రాణులను మ్రింగుచున్నవాడవై అన్ని దిక్కులయందు నీ నాలుకతో ప్రాణుల

నీదప్పకొనుచున్నావు. నీ భయంకరమయిన కాంతులు ఎల్లజ
గత్తులునిండి వాటిని తపింప చేయుచున్నవి.

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర ప్రసీద।
విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్. 31

హే దేవవర-ఓ దేవశ్రేష్ఠుడా; తే-నీకొరకు; నమః-నమస్కారము; అస్తు-అవుగాక; మే-నాకొరకు; ప్రసీద-ప్రసన్నుడవగుము; హి-ఏకారణమువలన; తే-నీయొక్క; ప్రవృత్తిం-వ్యాపారమును; న ప్రజానామి-తెలియనో; ఉగ్రరూపః-భయంకరాకారముగలిగిన; భవాన్-నీవు; కః-ఎవడవు; అహం-నేను; ఆద్యం-ఆద్యుడవైన; భవంతం-నిన్ను; విజ్ఞాతుం-తెలియుటకొరకు; ఇచ్ఛామి-కోరుచున్నాను; మే-నాకొరకు; ఆఖ్యాహి-చెప్పుము.

ఓ దేవదేవ, నీకు నమస్కారములు జేసెదను. నాకు గాను దయచేసి ప్రసన్నుడవగుము. నీ కిప్పుడు గలిగియుండు ప్రవృత్తికి హేతువు నాకు తెలియలేదు. ఈ ఘోరరూపముగల నీవు ఎవడవు. ఆద్యుడవయిన నిన్ను తెలిసికొనవలెనని కోరియున్నాను. దయచేసి నాకుచెప్పుము.

శ్రీ భగవాన్ ఉవాచ.

కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 32

శ్రీభగవద్వాక్యము. లోకక్షయకృత్ - లోకనాశకరమైన; ప్రవృద్ధః-ప్రబలమైన, కాలః-కాలము. అస్మి-అగుచున్నాను; లోకాన్-లోకములను, సమాహర్తుం- సంహరించుటకొరకు; ఇహ-ఈకాలమందు; ప్రవృత్తః-ఉద్యోగించినవాడను; అస్మి-అగుచున్నాను; ప్రత్యనీకేషు-ప్రతిసేనయందున్న; యోధాః-ప్రతిపక్షులై యుద్ధముచేయువారు; యే - ఎవరు; అవస్థితాః-ఉన్నారో; తేసర్వే-వారలందరును, త్వాంఋతేపి-నీదిగానున్న; నభవిష్యంతి-బ్రతుకజాలరు.

నేను ఈ ప్రపంచము నెల్ల నశింపజేయు బలమైన కాలస్వరూపిని. నేను ఇపుడు ఈ లోకములను సంహరించుటకై సిద్ధమయియున్నాను. ఈ రెండు సేనలయందు యుద్ధముజేయుటకు వచ్చిన వారలలో నీవు దక్క మరి ఎవరును బ్రతుకఁగల వారు లేరు.

తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ
జిత్వాశత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యంసమృద్ధం।
మయైవైతేనిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్. 33

తస్మాత్ - ఆకారణమువలన; త్వం-నీవు; ఉత్తిష్ఠ-యుద్ధమునకు లెమ్ము; శత్రూన్-దుర్యోధనాధులను; జిత్వా- గెలిచి; యశః-కీర్తిని; లభస్వ-పొందుము; సమృద్ధం - నిష్కంటకమైన; రాజ్యం-రాజ్యమును; భుఙ్క్ష్వ- అనుభవించుము; యేతే-ఈ నీ పగవారలు; పూర్వమేవ-మునుపే; మయైవ-నాచేతనే; నిహతాః-చంపబడిరి; హేసవ్యసాచిన్ - ఓయిఅర్జునా; త్వం-నీవు; నిమిత్తమాత్రం-కారణమాత్రము; భవ-అగుము.

గనుక నీవు యుద్ధము జేయుటకు బయలుదేరుము. నీ శత్రువులనందరిని జయించి కీర్తిపొంది ఏకచ్ఛత్రాధిపత్యమును అనుభవింపుము. నీపగవారందరు నాచే మున్నే సంహరింపఁబడిరి. నీవు కారణమాత్రుడుగా నుండుము.

ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ
కర్ణంతథాన్యా నపియోధవీరాన్
మయాహతాం స్త్వంజహిమావ్యధిష్ఠా
యుధ్యస్వజేతా సిరణేసపత్నాన్. 34

ద్రోణంచ- ద్రోణాచార్యునిన్ని; భీష్మంచ-భీష్మునిన్ని; జయద్రథంచ- సైంధవునిన్ని; కర్ణంచ- కర్ణునిన్ని; తథా- ఆరీతిగానే; అన్యాన్-ఇతరులైన; యోధవీరాన్-యుద్ధముచేయునట్టి పరాక్రమశీలురలను; మయా- నాచేతను, హతాన్ - పూర్వమే చంపబడిన వీరులను; త్వం-నీవు; జహి- గెలువుము; మావ్యథిష్ఠాః - భయపడకుము, యుధ్యస్వ- యుద్ధముచేయుము; రణే-యుద్ధమందు; సపత్నాన్- శత్రువులను, జేతాసి- గెలువఁగలవు.

ఇప్పటికే నాచే జంపఁబడిన ద్రోణ, భీష్మ, సైంధవ, కర్ణాదులగు పరాక్రమశాలు రనేకులను జయింపుము. నీవు చింత పడనక్కఱలేదు. యుద్ధములో శత్రువులను నీవుజయింపఁగలవు.

సంజయ ఉవాచ.

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య. 35

వేపమానః-వణకుచున్న కిరీటీ-అర్జునుడు, ఏతత్ -ఈ; కేశవస్య- శ్రీ కృష్ణునియొక్క, వచనం- వాక్యమును; శ్రుత్వా-విని; నమస్కృత్వా- నమస్కరించి, కృతాంజలిః- ము

కిరీటవాఁస్తుఁడై; భీతభీతస్సన్- మాటిమాటికి భయపడుచు ను
న్నవాఁడై; కృష్ణం-శ్రీకృష్ణునిగూర్చి; భూయఏవ- తిరిగిన్ని; ప్ర
ణమ్య- నమస్కరించి, సగద్గదం- తొట్రుపాటుతో కూడునట్లు;
ఆహ- పలికెను.

ఓ ధృతరాష్ట్రా పైని చెప్పిన శ్రీ భగవంతునిపలుకులు గడ
గడవణఁకుచున్న అర్జునుడువిని నమస్కారముచేసి అంజలీబద్ధుఁడై
మాటిమాటి- భయపడుచు, వందనములు జేయుచు భగవం
తునిజూచి ఒకమాట చెప్పెను.

అర్జున ఉవాచ

స్థానే హృషీకేశ తవప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ
రక్షాంసిభీతాని దిశోద్రవన్తి
సర్వేనమస్యన్తిచసిద్ధసంఘాః. 36

హే హృషీకేశ ఓ కృష్ణస్వామీ, తవ- నీయొక్క, ప్రకీ
ర్త్యా- కీర్తనచేత, జగత్ - జగత్తు, ప్రహృష్యతీతియత్
సంతోషించుచున్నదనునది యేది గలదో, తత్- ఇదిన్ని; అ
నురజ్యత ఇతి యత్- అనురాగమును పొందుచున్న దనునది
యేదిగలదో; తత్- అదిన్ని; రక్షాంసి- రాక్షసులు; భీతాని-
భయపడినవారలయి; దిశః-దిక్కులనుగూర్చి; ద్రవంతీతియత్-

పరుగిడుచున్నారనునది యేది గలదో; తత్ - అదిన్ని; సర్వే - నమ స్తములయిన; సిద్ధసంఘాః-సిద్ధసమూహములు; నమస్యంతి యత్ - నమస్కరింపు చున్నారనునది యేది గలదో; తత్ - అదిన్ని; స్థానే-యుక్తము.

ఓ హృషీకేశ, నీవు ఇంతటి మహాపురుషుడవు గనుకనే నిన్ను యెల్లలోకములు నుతించి సంతోషించుచున్నవి, నీయందధిక శ్రద్ధాభక్తులు జేయుచున్నవి. రాక్షసులందరునిన్ను జూచి మిగులభయమొంది అనేకదిక్కులకు వెళ్ళుచున్నారు. ఎల్లసిద్ధపురుషులు నీకు వందనములు జేయుచున్నారు.

కస్మాచ్చ తేనన మేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణోప్యాదికర్త్రే
అనంత దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదస త్తత్పరం యత్.　　37

హే మహాత్మన్ -ఓ మహానుభావుడా, గరీయసే-శ్రేష్ఠుడయినట్టిన్ని; బ్రహ్మణోపి-బ్రహ్మదేవునికిని; ఆదికర్త్రే - ఆదికారణమయినట్టి; తే-నీకొరకు, కస్మాత్ -ఎందువలన; ననమేరన్ -నమస్కరించకయుందురు, అనంత- అపరిచ్ఛిన్నుడవును, దేవేశ-దేవుడవున్ను; జగన్నివాస - జగత్తుకు ఆధారభూతుండవైన ఓ స్వామీ; అక్షరం-నాశములేనట్టిదిన్ని; సత్ - ఉన్న

దనేదిన్ని; అసత్ -లేదనునదిన్ని; తత్పరం-ఆరెంటికిపరమయి నదిన్ని; యత్ -ఏదో అది; త్వమేవ-నీవే.

ఓ భగవంతుడా! నీవు మిక్కిలి శ్రేష్ఠుడవై బ్రహ్మకు ఆది కారణభూతుడవైనందున నిన్ను ఎల్లప్రపంచములు పూజించుట సాధారణ ధర్మమేను. నీవు అనంతుడవు ప్రపంచములకు ఆధార భూతుడవు, నాశములేనివాడవు జగములనే జీవశరీరములకన్న శ్రేష్ఠమైన పరబ్రహ్మస్వరూపివి.

త్వమాదిదేవః పురుషః పురాణ
స్త్వమస్య విశ్వస్య పరంనిధానమ్
వేత్తాసివేద్యంచ పరంచధామ
త్వయాతతంవిశ్వ మనంతరూప. 38

హే అనంతరూప-ఓ కృష్ణస్వామీ; త్వం - నీవు; ఆదిదేవః-మొదటి దేవుడవున్ను. పురాణః - పురాతనుడైన; పురుషః-పురుషుడవున్ను; త్వం-నీవు; విశ్వస్య-జగత్తుకు; పరం-ఉత్కృష్టమయిన; నిధానం-ఆధారభూతుడవున్ను; వేత్తా-తెలిసినవాడవును; అసి-ఐతివి; వేద్యం-తెలియదగిన; పరం-ఉత్కృష్టమయిన; ధామ-స్థానమున్ను;త్వమేవ- నీవే; త్వయా-నీచేతను; విశ్వం-ప్రపంచము; తతం-వ్యాపించబడెను.

ఓ పురాణపురుష! నీవు సమస్త దేవతలకు ఆదిదేవతవు

పురాణ పురుషుడవు. ఈ ఎల్లప్రపంచములకు పరమాధార భూతుడవు విశ్వవేత్తవు మహానుభావులైన పురుషులవల్ల పొందదగిన మోక్షస్థానము నీవే ఈ ఎల్లజగత్తులు నీవల్ల వ్యాపింపబడియున్నది.

వాయుర్యమోగ్నిర్వరుణశ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ
నమోనమ స్తేస్తు సహస్రకృత్వః
పునశ్చభూయోపినమోనమ స్తే. 39

వాయుః-వాయువున్ను; యమః-యముడును; అగ్నిః- అగ్ని దేవుడున్ను; వరుణః-వరుణుడున్ను; శశాంకః - చంద్రుడున్ను, ప్రజాపతిః-బ్రహ్మదేవుడున్ను; ప్రపితామహశ్చ- బ్రహ్మకు తండ్రిన్ని- త్వమేవ- నివే (అందువలన); తే-నీకొఱకు; సహస్రకృత్వః-వెయ్యావర్తులు, నమః - నమస్కారము; పునః-తిరిగిన్ని; నమః-నమస్కారము; భూయోపి - తిరిగిన్ని; నమః-నమస్కారము,

ఓ కృష్ణ వాయువు, నిప్పు, వరుణుడు, చంద్రుడు. బ్రహ్మదేవుడు బ్రహ్మతండ్రియైన మహావిష్ణువు నీవె, నీకు వేయిమార్లు వందనములు పెక్కుమార్లు నమస్కారములు మరలనునమస్కారములు.

నమఃపురస్తాదథపృష్ఠత స్తే
నమోఽస్తుతే సర్వత ఏవసర్వ
అనంతవీర్యామితవిక్రమ స్త్వం
సర్వంసమాప్నోషితతోఽసిసర్వః. 40.

హే సర్వ-ఓ శ్రీకృష్ణస్వామీ; పురస్తాత్ - ముందరనున్ను; అథ-అనంతరమందు; పృష్ఠతః-వెనుకనున్ను, సర్వత్రఏవ- సర్వదిక్కులయందు; తే - నీకొఱకు, నమః;నమస్కారము; అస్తు- అవుగాక, అనంతరవీర్యామిత విక్రమః - అమితమయినసామర్థ్యమున్ను పరాక్రమమున్ను కలిగిన, త్వం- నీవు;సర్వం-సమస్తమున్ను,సమాప్నోషి- లెస్సగావ్యాపించియున్నావు; తతః-అందువలన, సర్వః - సర్వస్వరూపుడవు; అసి - అయితివి.

ఓ కృష్ణ నీకుమునుపు వెనుక ఎల్లదిక్కుల నమస్కారములు అమితమైన శక్తిపరాక్రమములు గలిగిన నీవు ఎల్లజగములయందు నిండుగా వ్యాపించియున్నందున సర్వస్వరూపుడవు నీవేను.

సఖేతిమత్వా ప్రసభంయదుక్తం
హేకృష్ణహేయాదవహేసఖేతి

అజానతామహిమానంతవేదం
మయాప్రమాదాత్ప్రణయేనవాపి. 41

తవ-నీయొక్క; ఇదం-యీవిశ్వరూపమునున్ను; మహిమా నం-మహిమనున్ను; అజానతా - తెలియనట్టి; మయా-నాచే తను; ప్రమాదాత్ - అజ్ఞానమువలన; ప్రణయేనవాపి- పరిచ యముచేతనయినా; సఖేతి-స్నేహితుడని; మత్వా - తలచి; హే కృష్ణ-ఓ కృష్ణుడా; హే యాదవ-ఓయాదవుడా; హేస ఖే-ఓ సఖుండా; ఇతి-అని; ప్రసభం- బలాత్కారముగా; యు త్-ఏవాక్యము; ఉక్తం-పలుకబడెనో, (దానినిక్షమింపుము.)

ఓకృష్ణ, నీ ప్రభావములను నేను ఇదివరలో ఎఱుగక పోయినందున నా అజ్ఞానము వల్ల నిన్ను ఇదివరకు మిత్రుడవని యెంచి ఓ కృష్ణ, ఓ యాదవ, ఓ మిత్రుడ అని సాధారణము గా పిలిచిన పలుకులను నాయందు కటాక్షించి మన్నించ వలయును.

యచ్చాపహాసార్థమసత్కృతోసి
విహారశయ్యాసనభోజనేషు
ఏకోథవాప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వా మహామప్రమేయమ్. 42

హే అచ్యుత-ఓ కృష్ణస్వామీ; అపహాసార్థం - పరిహాసార్థముకొఱకు; విహారశయ్యాసనభోజనేషు- విహారశయ్యాసనభోజనకాలమందు; అసత్కృత్య-తిరస్కరింపబడినవాడవు; ఆసీఃఇయచ్చ-అయిఱిననునది యేదికలదో; అథవా- అటుగాకపోయినట్లాయెనా; ఏకస్సన్ - పరోక్షమైనవాడవై; తత్సమక్షం-తత్ప్రత్యక్షమందున్న తిరస్కరింపబడిన వాడవనునది ఏదికలదో; తత్-ఆ అపరాధమునుగూర్చి; అప్రమేయం- ప్రమాణగోచరుడవు కానట్టి; త్వాం-నిన్ను; అహం-నేను; క్షామయే-క్షమింపజేయుచున్నాను.

ఓ మహానుభావా, నీవు, అప్రమేయుడవని ఎఱుగక, ఏకాంతంబునను; ఇతరుల యెదుటను,ఎగతాళిగా,విహారశయ్యాసన, భోజన సమయములయందు తిరస్కారముగా మాటలాడిన యపరాధంబులు క్షమచేసి క్షమింపుము.

పితాసిలోకస్య చరాచరస్య
త్వమస్యపూజ్యశ్చ గురుర్గరీ
యాన్నత్వత్సమో స్త్యభ్యధికః కుతోన్యో
లోకత్రయేప్య ప్రతిమప్రభావ. 43

హే అప్రతిమప్రభావ-అసమానమైనప్రభావముగలయో స్వామీ; త్వం-నీవు; చరాచరస్య- జంగమస్థావరాత్మకమైన;

అస్యలోకస్య–ఈప్రాణి సమూహమునకు; పితా - తండ్రిన్ని; పూజ్యః - పూజార్హుడవున్ను; గరీయాన్ - శ్రేష్ఠుడైన; గురుశ్చ–గురువున్ను; అసి- అయితివి, అందువలన; లోకత్రయేపి-మూడులోకములయందున్ను; త్వత్తః-నీకు; సమః - సమానుడు; నాస్తి-లేదు. అన్యః–ఇతరుడైన; అభ్యధికః - అధికుడు; కుతః–ఎక్కడివాడు; అనగా లేదనుట.

నీవు ఈడులేని ప్రభావములు గలవాడవు, చరాచరాత్మకమగు ఈసమస్త ప్రాణులకు తండ్రివి, పూజార్హుడవు, పరమగురుడవు. స్వర్గ, మర్త్య, పాతాళ లోకములయందు, నీకు సమానుడు లేడు, అధికుడు ఎచ్చటనుండి వచ్చును.

తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్. 44

తస్మాత్–ఆకారణమువలన. కాయః–శరీరమును; ప్రణిధాయ–పడవేసి, ప్రణమ్య–నమస్కరించి; ఈశం–నియామకుడవైన; ఈడ్యం–స్తోత్రార్హుడవైన, త్వాం–నిన్ను; ప్రసాదయే–ప్రసన్నునిగాచేసుకొనుచున్నాను; హే దేవ – ఓ శ్రీకృష్ణస్వామీ; పుత్రస్య– కొమారునియొక్క, అపరాధమును; పితేవ–

తంద్రివ లెనున్ను; సఖ్యుః-చెలికానియొక్క అపరాధమును; స ఖేవ-చెలికానివలెనున్ను; ప్రియాయాః - ప్రియురాలియొక్క అపరాధమును; ప్రియఇవ-ప్రియునివలెనున్ను; మే- నాయొక్క అపరాధమును; త్వం-నీవు;సోఢుం-సహించుటకొరకు; అర్హః సితగుదువు.

ఓ కృష్ణ స్తోత్రార్హుఁడవయిన నీకు సాష్టాంగముగానమ స్కరించి నాకు ప్రసన్నుఁడుగావలయునని వేడుకొనుచున్నాను నేను చేసిన సమస్త అపరాధములను పుత్రునితప్పులను తం డ్రివలెను సఖుని వలెను నాయకితప్పులను నాయకునివలెను నీ వు మన్నించి క్షమించవలయును.

అదృష్టపూర్వం హృషితోస్మిదృష్ట్వా
భయేనచ ప్రవ్యథితంమనో మే
తదేవమేదర్శయ దేవరూపం
ప్రసీద దేవేశ జగన్నివాస.

హే దేవ-ఓ కృష్ణస్వామి; అదృష్టపూర్వం - ఒకప్పుడుం జూడబడని విశ్వరూపమును; దృష్ట్వా-చూచి; హృషితః-సం తోషించినవాఁడను; అస్మి-అయితిని; మే-నాయొక్క; మనః- మనస్సు; భయేన-భయముచేతను; ప్రవ్యథితం-మిక్కిలిచలిం పబడినది; తద్రూపమేవ-అపూర్వరూపమునే; మే-నాకొఱకు;

దర్శయ-చూపుము; హే దేవేశ - ఓ దేవదేవుడ; జగన్నివాస-జగదాధారభూతుడవైన యోస్వామీ, మే-నాకు; ప్రసీద-ప్రసన్నుడవగుము.

ఓ జగన్నాయక, ఇదివరలో ఎన్నడును చూడనటువంటి నీవిశ్వరూపమును దర్శించి నేను విశేషఆనందముతో కూడినవాడనయితిని. అయినప్పటికిని, నా మనస్సు బహుభయమునుజెందియున్నది. నీ పూర్వ ఆకారమును నాకుచూపుము. ఓ దేవదేవ, ఓ జగదాధారభూతుడవయిన స్వామి నాకు, నీవు ప్రసన్నుడవు కమ్ము.

కిరీటినంగదినం చక్రహస్త
మిచ్ఛామిత్వాంద్రష్టు మహంతథైవ
తేనైవరూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవవిశ్వమూర్తే. 46

సహస్రబాహో - వేయిభుజములుగలిగిన; హే విశ్వమూర్తే-విశ్వరూపధరుడైన ఓ స్వామి, త్వాం-నిన్ను, కిరీటినం-కిరీటముగలవానిగానున్ను; తథైవ-అలాగుననే; గదినం - గదగలవానిగానున్ను; చక్రహస్తం - హస్తమందు చక్రముగలవానిగానున్ను; ద్రష్టుం-చూచుటకొఱకు; అహం - నేను; ఇచ్ఛామి-కోరుచున్నాను కావున; చతుర్భుజేన- నాలుగుభుజములు

గలిగిన, తేనరూపేణ - ఆపూర్వరూపముతో కూడినవాడవు; భవ- కమ్ము.

అనేక భుజములుగలిగి విశ్వరూపధరుడవయిన స్వామీ కిరీటము, గద, చక్రము ధరించిన నీ సహజరూపమును దర్శనము చేయుటకు చాలా కోరియున్నాను గనుక, నీవుదయయుంచి నీ సహజమయిన చతుర్భుజ రూపమును చూపుము.

శ్రీ భగవానువాచ.

మయాప్రసన్నేన తవార్జునేదం
రూపంపరందర్శితమాత్మయోగాత్
తేజోమయంవిశ్వ మనంతమాద్యం
యన్మేత్వదన్యేన నదృష్టపూర్వమ్. 47

హే అర్జున - ఓయియర్జునుడా, మే-నాయొక్క, యద్రూపం - ఏరూపము, తేజోమయం - తేజస్స్వరూపమైనదో; అనంతం-అంతములేనట్టిదిన్ని, ఆద్యం-ఆదియైనదిన్ని; త్వదన్యేన - నీకంటె ఇతరునిచేత: నదృష్టపూర్వం - పూర్వమందు చూడబడనట్టిదిన్ని, పరం-ఉత్కృష్టమైనదిన్ని; ఇదం విశ్వరూపం-యీ విశ్వరూపమును; ప్రసన్నేన-ప్రసన్నుడవైన; మయా-నాచేతను; ఆత్మయోగాత్ - ఆత్మయోగ సామర్థ్యమువల

న; త్వద-నీకు; దర్శితం-చూపించబడెను.

ఓయి అర్జున! నీయందుదయచేసి నా యోగసామర్థ్యము వల్ల తుద మొదలు లేనిదియు అనాదియు తేజోమయమైనట్టిది యు నీకంటె నితరులచేత నింతకుమునుపు చూడబడనిదియు పరమోత్కృష్టమైనదియు నైన, నా విశ్వరూపమును నీకు చూపితిని.

న వేదయజ్ఞాధ్యయనైర్న దానై
ర్నచ క్రియాభిర్న తపోభిరుగ్రైః
ఏవంరూపశ్శక్య అహంన్నృలోకే
ద్రష్టుంత్వదన్యేన కురుప్రవీర. 48

హే కురుప్రవీర - ఓ యర్జునా; ఏవంరూపః- యీ విశ్వ రూపముగల; అహం- నేను; నృలోకే-మనుష్యలోకమందు; త్వ దన్యేన-నీకంటె నితరునిచేతను; వేదయజ్ఞాధ్యయనైః-వేదయ జ్ఞాధ్యయనములచేతను; దానైః-దానములచేతనున్ను; క్రియా భిః-క్రియలచేతను; ఉగ్రైస్తపోభిః - ఉగ్రతపస్సులచేతను; ద్ర ష్టుం-చూచుటకొఱకు; నశక్యః - శక్తుడనుకాను.

ఓయి అర్జున! ఈ మహాత్మైన విశ్వరూపమును మర్త్యలో కమునందు నీకు ఒక్కనికే దర్శనమిచ్చితిని, మరిఒకరు ఎం

త వేదయజ్ఞాధ్యయనములుచేసిన వారలయినా ఎంతకర్మనిష్ఠు
లయినా ఎంత ఉగ్రమయిన తపస్సుగలవారైనా వారికి దర్శ
నము ఇచ్చువాడను కాను.

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య. 49

ఈదృక్-ఇట్టి; ఘోరం-భయంకరమైన; మమ - నాయొ
క్క; ఇదంరూపం-ఈరూపమును; దృష్ట్వా-చూచి; తే-నీకు;
వ్యథా-భయమున్ను, విమూఢభావః - తెలివిలేకయుండుటయు
ను; మాచ-వద్దు; త్వం-నీవు; వ్యపేతభీః పోగొట్టబడిన భయ
ముగలవాడై; ప్రీతమనాః-సంతోషమనస్సుగలవాడవై, పునః-
తిరిగిన్ని; మే-నాయొక్క; తదిదంరూపమేవ-ఆయాపూర్వరూప
మునే; ప్రపశ్య-చూడుము.

భయంకరమైన నా విశ్వరూపమును చూచుటవలన నీకు
గలిగిన భయమును, చిత్తవిభ్రాంతిని, విడువుము, నీవు నిర్భీ
తుడవై సంతుష్ట మనస్కుడవై నాసహజరూపమును చూ
డుము.

సంజయ ఉవాచ.

ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః।
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా. 50

సంజయుడు చెప్పుచున్నాడు. ఇతి-ఇట్లని; వాసుదేవ- శ్రీకృష్ణస్వామి; అర్జునం-అర్జునుని గూర్చి; తదా - అప్పుడు; ఉక్త్వా-పలికి; భూయః-తిరిగిన్ని; స్వకం రూపం- స్వకీయమైన పూర్వరూపమును; దర్శయామాస-చూపెను; మహాత్మా- శ్రీకృష్ణస్వామి; సౌమ్యవపుః - శాంతశరీరము గలవాడు; భూత్వా-అయి; భీతం-భయపడిన; ఏనం-ఈఅర్జునుని; పునః-తిరిగిన్ని; ఆశ్వాసయామాస-ఊరడించెను.

ఓయి ధృతరాష్ట్ర, శ్రీకృష్ణులు అర్జునుని చూచి ఈప్రకారముగా చెప్పినవారై తన సహజరూపమునుచూపి భయపడియున్న అర్జునుని ఊరడించెను.

అర్జున ఉవాచ.

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన।
ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః. 51

హేజనార్దన - ఓ కృష్ణస్వామీ; సౌమ్య-ప్రసన్నమైన; మానుషం-మనుష్యసంబంధమైన; తవ-నీయొక్క; ఇదంరూపం-ఈ యాకారమును; దృష్ట్వా-చూచి; ఇదానీం-ఇప్పుడు; సంవృత్తః-స్వస్థతనుబొందినవాడను; సచేతాః-చైతన్యముతోఁగూడినవాఁడను; ప్రకృతిం-స్వభావమును; గతః-పొందినవాఁడను; అస్మి-అయితిని.

ఓ జనార్దన! ఇప్పుడు సౌమ్యమైన నీమానుషరూపమును చూచి నాకు బుద్ధిస్థిరమాయెను. నేను జనులలో చేరినవాడనయితిని.

శ్రీ భగవానువాచ.

సుదుర్దర్శమిదంరూపం దృష్టవానసియన్మమ।
దేవాఅప్యస్యరూపస్య నిత్యందర్శనకాంక్షిణః. 52

మమ-నాయొక్క; యద్రూపం-ఏరూపమును; దృష్టవాన్-చూచినవాఁడవు; అసి-అయితివో; సుదుర్దర్శం-మిక్కిలిచూడనశక్యమైన; ఇదంరూపం-ఈరూపమును; దేవాఅపి- దేవతలును; నిత్యం-ఎల్లప్పుడును; దర్శనకాంక్షిణః - చూడగోరుచుందురు.

నీకు దర్శనంబిచ్చిన నాస్వరూపము మహాసంకటమాయె.

ఇట్టివిశ్వరూపము చూచుటకు దేవతలందరు సదా కోరెదరు.

నాహం వేదైర్నతపసా నదానేనచేజ్యయా।
శక్యఏవంవిధోద్రష్టుం దృష్టవానసిమాంయథా. 53

మాం- నన్ను; యథా- ఏ ప్రకారముగా; దృష్టవాన్- చూచినవాఁడవు; అసి- అయితివో; ఏవంవిధః- ఇట్టి విశ్వరూపమును ధరించిన; అహం - నేను; వేదైః- వేదములచేతను; తపసా- తపస్సుచేతను; దానేన- దానముచేతను; ఇజ్యయా - యజ్ఞముచేతను; ద్రష్టుం- చూచుటకొఱకు; నశక్యః- శక్యుఁడనుగాను.

నీకు చూపిన విశ్వరూపమును వేదము చదివిన వారలకు గాని తపస్సుచేసిన వారలకు గాని యజ్ఞములు చేసిన వారలకు గాని చిక్కదు.

భక్త్యాత్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున।
జ్ఞాతుంద్రష్టుంచతత్త్వేన ప్రవేష్టుంచపరంతప. 54

పరంతప-శత్రుతాపకుఁడవైన; హే అర్జున- ఓయర్జునా; అనన్యయా-ఇతరాసక్తముగాని; భక్త్యా- భక్తిచేత; ఏవంవిధః-ఇట్టివిశ్వరూపమును ధరించిన; అహం-నేను; తత్త్వేన-యాథార్థ్యముచేత; జ్ఞాతుం - తెలియుటకొఱకును; ద్రష్టుం-చూచుటకొఱకును; శక్యః-శక్యమైనవాఁడను.

శత్రుతాపనుడవైన ఓయి అర్జునా విశ్వరూపధరుడనయిన నన్ను ఇతరాసక్తిలేని అచంచల భక్తిచేత మాత్రము తెలిసి కొనవచ్చును, చూడవచ్చును, పొందవచ్చును, వేరు సాధనములు లేవు.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః।
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతిపాండవ. 55

హేపాండవ - ఓయర్జునుడా; మత్కర్మకృత్ - నాకొఱకు సత్కర్మమును జేయువాడును, మత్పరమః - నేనేయుత్కృష్టగతిగాఁగలవాఁడును; మద్భక్తః - నన్నే సర్వప్రకారములచేత భజించువాఁడును; సంగవర్జితః - ధన బంధు పుత్రమిత్రకళత్రాది సంగముచేత విడువఁబడినవాఁడును; సర్వభూతేషు-సమస్తప్రాణులయందు; నిర్వైరః- వైరములేనివాఁడును; యః- ఎవ్వఁడో; సః- వాడు; మాం- నన్ను; ఏతి- పొందుచున్నాడు.

ఓ యిపాండవా! ఎవడైతే నాకొఱకు సత్కర్మలుచేసి నేనే ఉత్కృష్టగతియని నమ్మి నన్నే అనేకప్రకారములచే ధ్యానించి ధన, బంధు, పుత్ర, మిత్ర, కళత్రాది సంగములయందు ఆసక్తివిడచి సర్వప్రాణికోట్లయందు వైషమ్యము లేక యున్నాడో, అట్టివాడు నన్ను పొందుచున్నాడు.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే
విశ్వరూప సందర్శన యోగోనామ
ఏకాదశోఽధ్యాయః.

ఇట్లు ఉపనిషద్ రూపములును, బ్రహ్మ విద్యయును,
యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదరూపం
బైన విశ్వరూప సందర్శన యోగమనెడి
ఏకాదశోఽధ్యాయము ముగిసినది.



శ్రీ భగవద్గీత.

భక్తి యోగో నామ ద్వాదశోఽధ్యాయః.

అర్జున ఉవాచ.

ఏవంసతతయుక్తాయే భక్తాస్త్వాంపర్యుపాసతే।
యేచాప్యక్షరమవ్యక్తం తేషాంకేయోగవిత్తమాః. 1

ఏవం-ఈప్రకారముగా; సతతయుక్తాః - నిరంతరమును; (భగవత్కర్మాదులయందు సమాహితులయినవారలై); యేభక్తాః-ఏభక్తులు; త్వాం-నిన్ను; పర్యుపాసతే-ధ్యానముసేయుచున్నారో; యేచాపి - ఎవ్వరైనను; అవ్యక్తం - ఇంద్రియా

గోచరమైన; అక్షరం-బ్రహ్మమును; పర్యుపాసతే-ధ్యానము
చేయుచున్నారో; తేషాం - వారలలోపల; కే-ఎవరు; యోగ
విత్తమాః-మిక్కిలియోగమును దెలిసినవారలు.

ఓ కృష్ణ పై జెప్పినరీతిగ భగవత్ప్రీతిగ ఎల్లప్పుడు కర్మ
లు జేయుచు నిన్ను సదా ధ్యానము చేయు వారలలోను ఇంద్రి
యములకు గోచరముగానట్టి పరబ్రహ్మను సంధానము జేయు
వారలలోను యోగిశ్రేష్ఠులెవరు.

శ్రీ భగవానువాచ.

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా మతాః. 2

యే-ఏభక్తులు; మయి-నాయందు; మనః-మనస్సును; ఆ
వేశ్య-ఉంచి; నిత్యయుక్తాః - నిరంతరసమాహిత చిత్తులయి;
పరయా-ఉత్కృష్టమైన; శ్రద్ధయా-శ్రద్ధతోడ; ఉపేతాస్సం
తః-కూడినవారలయి; మాం - నన్ను, ఉపాసతే-ధ్యానించు
చున్నారో; తే-వారలు; యుక్తతమాః-మిక్కిలియుక్తులయిన
వారలని; మే-నాకు; మతాః-ఇష్టులు.

ఎవరైతే నాయందు మనస్సు నిలిపి ఎల్లప్పుడు సమాహిత
చిత్తులయి మిక్కిలి శ్రద్ధతో గూడుకొని నన్ను ధ్యానించుచు
న్నారో అట్టి యుత్తమపురుషులు నాకు సమ్మతియైనవారు.

యేత్వక్షరమనిర్దేశ్య మవ్యక్తంపర్యుపాసతే।
సర్వత్రగమచింత్యంచ కూటస్థమచలంధ్రువమ్. 3
సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్రసమబుద్ధయః।
తేప్రాప్నువంతిమామేవ సర్వభూతహితేరతాః. 4

యేతు-ఎవ్వరైతే; అక్షరం-నాశరహితమైన; అనిర్దేశ్యం-నిర్ణయింపఁగూడని; అవ్యక్తం-రూపాదిరహితమైన; సర్వత్రగం-అంతటవ్యాపించియున్న; అచింత్యం-ధ్యానించఁగూడని; కూటస్థం-ప్రకృతియందున్న; అచలం - చలించని; ధ్రువం-నిత్యమైన, (బ్రహ్మమును): పర్యుపాసతే-ఉపాసన చేయుచున్నారో; ఇంద్రియగ్రామం- ఇంద్రియసమూహమును; సన్నియమ్య-లెస్సగా నిగ్రహించి; సర్వత్ర - సమస్తకాలములయందును; సమబుద్ధయః-సమబుద్ధిగలిగియున్నవారలు, సర్వభూతహితే-సమస్తప్రాణిహితమునందు; రతాః - ఆసక్తులైనవారలు; యే-ఎవరో; తే-వారలు; మామేవ-నన్నే; ప్రాప్నువంతి-పొందుచున్నారు.

ఎవరైతే ఎల్లకాలములయందు ఇంద్రియనిగ్రహముగలిగి సమబుద్ధితో ఎల్ల ప్రాణిసమూహములయందాసక్తిగలిగి నాశములేనట్టియు, నిర్దేశింపగూడనట్టియు, రూపరహితమయినట్టియు, అంతటవ్యాపించియున్నట్టియు, ధ్యానించకూడనట్టియు,

ప్రకృతి యందున్నట్టియు, చలించ నట్టియు, శాశ్వత మయినట్టి
పరబ్రహ్మమును ఉపాసన జేయుచున్నారో వారు నన్నే జెందు
చున్నారు.

క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్।
అవ్యక్తాహిగతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే. 5

తేషాం-ఆ; అవ్యక్తాసక్తచేతసాం - పరబ్రహ్మమునందాసక్తమ
యిన చిత్తముగలవారలకు; క్లేశః-కష్టము; అధికతరః-మిక్కి
లియధికమయినది; హి-ఏకారణమువలన; దేహవద్భిః- దేహా
భిమానముగలవారలచేత; అవ్యక్తా-అతిగుప్తస్వరూపమైన;గతిః-
మార్గము; దుఃఖం-దుఃఖముగునట్లు; అవాప్యతే - పొందం
బడుచున్నదో.

అట్టి పరబ్రహ్మమందు ఆసక్తమయిన మనస్సుగలవారలకు
మిక్కిలి కష్టముకలుగును. శరీరాభిమానముగల మనుష్యులకు
హెచ్చుకష్టములు కలుగికనే పరబ్రహ్మనిష్ఠ సిద్ధింపదు.

యేతుసర్వాణికర్మాణి మయిసన్న్యస్యమత్పరాః।
అనన్యేనైవయోగేన మాంధ్యాయంతఉపాసతే. 6
తేషామహంసముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామినచిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్. 7

యేతు-ఎవరైతే; మత్పరాస్సంతః- నేనేయుత్కృష్టగతిగా

గలవారలయి; సర్వాణికర్మాణి - సమస్త కర్మములను; మయి- నాయందు; సన్న్యస్య - సమర్పించి; అనన్యేన- అన్యదితరాలంబనములేని; యోగేనైవ-సమాధిచేతనే; మాం - నన్ను; ధ్యాయంతః- ధ్యానము చేయుచున్నవారలై; ఉపాసతే- సేవించుచున్నారో; హేపార్థ- ఓయిఅర్జునా; మయి-నాయందు; ఆవేశితచేతసాం-ఉంచబడినచిత్తముగలిగిన; తేషాం-వారలకు; అహం-నేను; మృత్యుసంసారసాగరాత్ - మృత్యురూపమైన సంసారమనెడి సముద్రము వలనను; సముద్ధర్తా- ఉద్ధరించువాడను; నచిరాత్ - శీఘ్రముగా; భవామి- అవుచున్నాను.

ఓ అర్జున! ఎవరైతే నన్నే మిక్కిలి ఉత్తమగతిగా దలంచి ఎల్ల కర్మలను నాకు అర్పణముజేసి నన్నే తమ బుద్ధియందు నిలిపి ధ్యానము జేయుచున్నారో అట్టి చిత్తవృత్తిగలిగిన వారిని అతి శీఘ్రముగా మృత్యు రూపమయిన సంసార సాగరమును దాటించువాడనుగా నున్నాను.

మయ్యేవమనఆధత్స్వ మయిబుద్ధింనివేశయ।
నివసిష్యసిమయ్యేవ అతఊర్ధ్వం నసంశయః. 8

మయ్యేవ-నాయందే; మనః-మనస్సును; ఆధత్స్వ-ఉంచుము; మయి-నాయందే; బుద్ధిం-బుద్ధిని; నివేశయ- ఉంచుము;

అతఊర్ధ్వం—ఈదేహమునశించినపిమ్మట; మయ్యేవ—నాయందే; నివసిష్యసి-ఉండఁగలవు; నసంశయః – సందేహము లేదు.

నీ మనస్సును తెలివిని నాయందే స్థిరముగానిలుపుము. ఆలాగు చేసితివేని ఈ దేహము నశించినవెనుక నిస్సంశయము గా నన్నే జెందుచున్నావు.

అథచిత్తం సమాధాతుం నశక్నోషిమయిస్థిరం।
అభ్యాసయోగేనతతో మామిచ్ఛాప్తుం ధనంజయ. 9

ప్రే॰ ధనంజయ—ఓయి అర్జునా; అథ— అటుపిమ్మట; మయి—నాయందు; చిత్తం—చిత్తము; స్థిరం-నిశ్చలముగునట్లు; సమాధాతుం-ఉంచుటకొఱకు; నశక్నోషి - శక్తుఁడవుకాకపోతివేని; తతః-ఆతర్వాత; అభ్యాసయోగేన - అభ్యాసయోగము చేత; మాం—నన్ను; ఆప్తుం-పొందుటకొఱకు; ఇచ్ఛ-కోరుము.

ఓ అర్జున! పైఁ జెప్పినవిధముగా నీ మనస్సును తెలివిని నాయందు నిశ్చయముగా నిలుపుటకు శక్తిలేనివాడవయితివేని నన్ను పొందవలెననే కోరిక గలిగి యున్నతిన్నగా అభ్యాసము జేయుము.

అభ్యాసేప్యసమర్థోసి మత్కర్మపరమోభవ।
మదర్థమపికర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి. 10

అభ్యాసేపి—అభ్యాసయోగమందును; అసమర్థః – అశ

క్తుడవు; అసి-అయితివేని; మత్కర్మపరమః- నావిషయమైన
కర్మమే ప్రధానముగాఁ గలవాఁడవు; భవ- కమ్ము; మదర్థం-
నాకొఱకు; కర్మాణి-సత్కర్మములను; కుర్వన్నపి-చేయుచున్న
వాఁడవయ్యును; సిద్ధిం-మోక్షమును; అవాప్స్యసి-పొందగలవు.

అట్లు అభ్యాసము జేయుటకుగూడ నీకు శక్తిలేకపోయె నేని
నావిషయమయ్యే ఎల్లకర్మలు జేయుము అట్లు నా ప్రీతికిగాను
మంచికర్మ జేసితి వేని నీకు మోక్షము సిద్ధించును.

అథైతదప్యశక్తోసి కర్తుం మద్యోగమాశ్రితః।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్.          11

అథ-ఆపిమ్మట, ఏతదపి - ఈకార్యంబును; కర్తుం - చే
యుటకొఱకు; అశక్తః-అసమర్థుండవు; అసి - అయితివేని;
మద్యోగం-నాయొక్క యోగమును; ఆశ్రితస్సన్ - ఆశ్రయిం
చినవాఁడవై; తతః-పిమ్మట; యతాత్మవాన్- నియమింపఁబ
డినచిత్తముగలవాఁడవై, సర్వకర్మఫలత్యాగం-సమస్తకర్మ
ఫలత్యాగమును; కురు-చేయుము.

అందుకును నీవు సామర్థ్యము లేనివాడవయితివేని నన్నే
ఆశ్రయించి చలింపని మనస్సుగలవాడవయి నాయందు భార
ము వేసి నీవు చేయు కర్మఫలమును నాకు సమర్పణచేయుము.